# *Khadi Sidhantamu*

## (ECONOMICS OF KHADI)



BY

K. P. MALLIKHARJUNUDU, M. A., B. L.,

*Advocate,*

Buttaiapet, MASULIPATAM.





1947

Rs. 1—8—0
[Postage Extra.]

# పీఠిక.



'అభ్యుదయము', 'నిశ్శ్రేయసము' మానవునియొక్క పరమలక్ష్యము లని మన ప్రాచీనశాస్త్రములు వక్కాణించి యున్నవి. 'అభ్యుదయము' అనగా యిహలోక సౌఖ్యము. 'నిశ్శ్రేయసము' అనగా పరలోకసౌఖ్యము లేక మోక్షము. దేహము పంచభూతాత్మకమైనదనియు, దేహముకంటె భిన్నమైన ఆత్మ కలదనియు, మరణముచేత దేహము నశించినను, ఆత్మ మిగిలియుండి అన్యదేహము నవలంబించుననియు- యిట్లు తిరిగి దేహమును పొందుటయే జన్మాంతరప్రాప్తియనియు, జననమరణరూపసంసారప్రవాహమునకు మనుష్యులు గతజన్మములయందు చేసిన కర్మవాసనలే కారణ మనియు, సంసారమువలన కలుగు దుఃఖములనుంచి ఉత్తీర్ణులై, శాశ్వత సుఖ మనుభవించుటయే నిశ్శ్రేయసము లేక మోక్షమనియు వేదశాస్త్రవిజ్ఞానఖనులు నుడివియున్నారు. ఈ ప్రాచీనసంప్రదాయము వైరాగ్యమును ఉద్బోధించుచున్న కారణమున, మానవులయందు ముఖ్యముగా దానిని అనుసరించే హిందువులయందు అలసభావము పోషింపబడి, నిర్వీర్యత కలిగి, కర్మయందు ఉత్సాహము తగ్గిపోయెను. అందువలన భారతీయులు సోమరులై, నవ్యప్రపంచమున హీనస్థితిని పొందియున్నారని కొందఱు వాదించుచున్నారు. ఈ వాదనయందు ఎంత మాత్రము యథార్థములేదనియు, ప్రస్తుత హీనస్థితికి వేఱు కారణములున్నవనియు, మనము ఘంటాపథముగా చెప్పవచ్చును.

లోబడి కర్మ చేసితివేని అధోగతి జెందుదువనియు, ఫలాపేక్ష లేక విహితకర్మ చేసితివేని, ఉత్తమగతిని పొందుదు వనియు మన శాస్త్రములు ఉద్ఘోషించి యున్నవి.

ఇట్టి ఉత్తమాదర్శమును జేర్చుటకు ఎట్టి ఆర్థికవ్యవస్థ అనువైన సాధనమగునో నిరూపించి, దానికి ఖాదియే ప్రధానముగా గల వ్యవస్థయే సరియైనదని సంగ్రహముగా వివక్ష జేయుటకు యీ చిన్నపుస్తకమును వ్రాసితిని. ఈ దృష్టిని మనసులో నిడుకొని పాఠకులు దీనిని గ్రహింతురు గాత మని వేడుచున్నాను.



# ఒకటవ అధ్యాయము

## సామాజిక వ్యవస్థ — దాని లక్ష్యము

మానవుని లక్ష్యమేమిటో, ఆ లక్ష్యసిద్ధికై ఎట్టి వ్యవస్థలు అవసరమో, ఆ వ్యవస్థలలో ఏది ఉత్తమమైనదో తెలిసికొనవలసియున్నది. పారలౌకికమైన నిశ్శ్రేయసమును ప్రకృతమున వదలివేసినను, ఐహికమైన అభ్యుదయము లక్ష్యమని చెప్పుటలో ఎట్టి శంకయును కలుగనేరదు. ఐహికాభ్యుదయమననేమి? అభ్యుదయ మనునది రెండింటివలన సిద్ధించును. దుఃఖనివృత్తి, సుఖప్రాప్తి కలిగినచో అభ్యుదయసిద్ధి చేకూరును. ఆకలిదప్పులు, శీతోష్ణములు, ఆధివ్యాధులు మొదలగువానివలన మనుష్యులకు దుఃఖములు సంభవించుచున్న వనుట ఎల్లరకు అనుభవవేద్యమే. వీనివలన కలుగు దుఃఖముల నుపశమింపజేయకున్నచో, మనుష్యుడు ఎట్టి సుఖమును, వికాసమును బొందజాలడు. ఆకలిదప్పుల నడంచుటకు అన్నపానములును, శీతోష్ణముల నాపుటకు వస్త్రము, నివాసమును, ఆధివ్యాధుల పోద్రోలుటకు విద్య, విజ్ఞానమునూ అవసరమైయున్నవి. వీనిని సంపాదించుటకు మానవుడు కృషిచేయవలసియున్నది. ఇందుకు కావలసిన వస్తువులను సేకరించుటకే అర్థసంపాదనమని పేరు. మనుష్యులు తమ అవసరములకై కృషిచేసి సంపాదించిన వస్తువులనే 'అర్థ' మందురు. ఆర్థికశాస్త్రమునందు ఉపయోగింపబడెడు అర్థశబ్దమునకు యిదే తాత్పర్యము. అర్థసంపాదనము మిక్కిలి అవసరము. లేకున్న మనుష్యజీవితము దుర్భర

యీ పరిశ్రమలయందు కూలిచేసికొని జీవింపవలసివచ్చెను. దీనిని పెట్టుబడిదారీపద్ధతి అనిఅందురు. ఈ పద్ధతియందు కూలి, వారి జీవితము, పెట్టుబడిదారుల దయాదాక్షిణ్యాములమీాద ఆధారపడియుండెను.

వస్తూత్పత్తిసాధనములు పెట్టుబడిదారుల చేతులలో నుండెను. ఆసాధనముల నుపయోగించి, తద్వారా వస్తువులను చేయువారికి, సాధనములయందు హక్కు లేదు. సాధనములతో బనిచేయుటయే వారివిధి. ఉత్పత్తిచేయబడిన వస్తువులయందు వారికి హక్కు లేదు. వాటిని వినియోగించుటకుగాని, అనుభవించుటకుగాని, భూమందునకే అధికారమున్నదిగాని, కూలి చేయువారికిలేదు. దీనికి ప్రధానకారణము స్వంత ఆస్థినికలిగి యుండుటయనే సిద్ధాంతము. "ఆస్తి"సామాన్యముగావ్యక్తులకు చెందియుండును. ఎవరి ఆస్తివారిది. దానిని అనుభవించుటకు గాని, విక్రయము మొదలైన వ్యవహారములు చేయుటకుగాని, ఆస్తికలవారికే వీలగును. ఆ స్తిస్థిరరూపముగా నుండవచ్చును. భూమి, యిల్లుమొదలైనవి స్థిరాస్తులు. పశువులు, వస్తువాహనములు మొదలైనవి చరాస్తులు. వ్యక్తులకు ఆస్తియందలి హక్కులు సంక్రమించియుండుననే సిద్ధాంతమునుబట్టి, అర్థలాభమునందు వ్యక్తులకు ఆశ యినుమడించును. సాధ్యమైనంత వఱకు అర్థవస్తువులను తానేసంపాదించి, తన సౌఖ్యమునకే వినియోగించుకొనవలయునను అభిలాషపొడమును. ఇట్టి అభిలాషలు అనేకవ్యక్తులకు ఉండునుకాబట్టి, ఒకరితో నొకరికి స్పర్థలు, పోటీలు, హెచ్చును; వివాదములు ఏర్పడును. ఇతరులతో పోటీలు జయప్రదముగా నడచుటకు వ్యక్తులు కొందరు

జేరి సంఘములుగా ఏర్పడి, ఆస్తులను సంఘపరము జేయ వచ్చును. అట్టిచో కేవలము వ్యక్తిగతములైన ఆస్తులు అనునవి లేక, సంఘమునకే చెందియున్నను, వ్యక్తిలాభమును పురస్కరించుకొనియే ఆ సంఘములు ఏర్పడియున్నందునను, ఆ సంఘములో జేరినవారికే వాటియొక్క లాభము చెంది యున్నందువలనను, స్వంతఆస్తిఅనియే వానిని కూడ చెప్పవలసియున్నది. ఈ విధమైన పెట్టుబడిదారీవిధానమే ప్రస్తుతము అన్ని దేశములలోను ముఖ్యముగా పారిశ్రామిక దేశములైన పాశ్చాత్యదేశములలోను కానవచ్చుచున్నది. ఒక్క రష్యా దేశములో మాత్రము యిందుకు భిన్నమైన పద్ధతిగలదు. పెట్టుబడిదారీపద్ధతిగల పాశ్చాత్య దేశములలో, ఆ యా పరిస్థితుల బట్టి, అవాంతర భేదములున్నమాట నిజమే కాని, మొత్తము మీద ఆ పద్ధతియే, ప్రస్తుత సామాజికవ్యవస్థగా నడచుచున్నది.

రష్యా దేశములో మాత్రము భిన్నమైన వేతొక వ్యవస్థ స్థాపింపబడెను. దానిని సాంఘికవాదపద్ధతి అని అందురు. వర్గభేదములు లేకుండుట, వస్తూత్పత్తి సాధనములు యావత్తు సంఘమునకు జెందియుండుట, స్వంతఆస్తి లేకుండుట, మొదలగునవి యీ సిద్ధాంతమునందు ముఖ్యలక్షణములు. పెట్టుబడిదారీ పద్ధతియందు, వర్గభేదముకలదు. ధనికవర్గము, దరిద్ర వర్గము అనునవి కలవు. ధనికులు మఱింత ధనికులగుచున్నారు. దరిద్రులు మరింత దరిద్రులగుచున్నారు. దరిద్రులు, ధనికులు అనే వర్గములు యే సంఘమునందు లేకుండునో, ఆసంఘమే

ఉత్తమమైన సంఘము. కావున యిట్టి వర్గభేదములేనట్టి సంఘ నిర్మాణము మిక్కిలి అవసరము.

ధనికులు, దరిద్రులు అనే వర్గనిర్మాణమునకు, వస్తూత్పత్తిసాధనములయందు గల హక్కులే ప్రధానకారణము. ఈ సాధనములు పెట్టుబడిదారీవిధానమునందు, ధనికుల వశమందున్నవి. కష్టపడి పనిచేయువారికి వానియందు ఎట్టి స్వత్వములున్నూ లేవు. ఆ సాధనములు వారికి చెందియున్నంతవరకు శ్రామికులకు సౌఖ్యముగాని [illegible] శాంతి సౌఖ్యము లేనంతవరకు, ధనికులు ఎంతగా [illegible] పని ప్రయత్నము చేసినప్పటికిన్నీ, [illegible] యున్నంతవరకు, ప్రపంచశాంతి యుండజాలదు. కావున ఆ సాధనములు అందరికీ హక్కు కలరీతిని సంఘమునకే చెందియుండవలెను. అట్టి సంఘనిర్మాణమునకు సాంఘికవాదపద్ధతి అవసరము.

స్వంతఆస్తి అనే హక్కు ఉన్నంతవరకు ఉత్పత్తి సాధనములను ధనికులే కలిగియుందురు. ఆ సాధనములను సంపాదించే అవకాశములు వారికే వుండును. సాధనములయందు వారికి హక్కు లేదని శాసింపబడినయెడల, తమ లాభమునకై వాటిని మనుష్యులు ఉపయోగింపరు. సంఘశ్రేయమునకు మాత్రమే వానిని ఉపయోగించగలరు. ఆర్థికదృష్ట్యా సమానత్వము ఉన్ననే తప్ప సంఘమునందు శాంతి చేకూరజాలదు. పైన జెప్పిన కారణముల పురస్కరించుకొని, మానవుని యొక్కయు, సంఘముయొక్కయు, శాంతి సౌఖ్యములు స్థిరముగా నుండవలెనన్నచో, సాంఘికవాదపద్ధతియే సంఘముయొక్క లక్ష్యముగా నుండవలెనని రష్యాలోని

కమ్యూనిస్టుపార్టీ వాదించుచున్నారు. దీని ననుసరించి ఇతర దేశములలోని కమ్యూనిస్టుపార్టీ వారుకూడ యీ వాదమును బలపఱచుచున్నారు.

ప్రస్తుతము నాగరిక దేశము లనబడు దేశములలో యీ రెండు సిద్ధాంతములు సంఘలక్ష్యమునకు మార్గదర్శములుగా నున్నవి. ఈ రెండు సిద్ధాంతములలోను, అవాంతరభేదములు కలవు. స్థలాభావముచేత వాటిని వివరించలేదు. తత్త్వతః అవి అన్నియు పై రెండిటి క్రిందనే చేరియుండును. కాన వాటి వివరములను యిట పొందుపఱచ లేదు.

# రెండవ అధ్యాయము

## గాంధివాదము లేక అహింసావాదము

గాంధీమహాత్ముడు యీ దేశమున నాయకత్వము వహించినప్పటినుండియు, నూతనమార్గమును బోధించుచు వచ్చినాడు. ఈ మార్గము అహింసామార్గము; సత్యమార్గము. మొదటి అధ్యాయములో సూచించిన మార్గములకు యిది భిన్నమైనమార్గము. ఇహలోకమునకు సంబంధించినంతవరకు అభ్యుదయమే మానవుని లక్ష్యముగా చెప్పబడియున్నది. అభ్యుదయసాధనకు ఉత్తమమార్గమేది? పూర్వము చెప్పబడిన పెట్టుబడిదారీవిధానము, సాంఘికవాద విధానము ఎట్లు లక్ష్యమును చేర్చజాలవు? అహింసామార్గ మెట్లు లక్ష్యసిద్ధికి తోడ్పడును? అనే విషయము విచారణీయము. దుఃఖనివృత్తి

సుఖప్రాప్తి కలుగుటయే అభ్యుదయసిద్ధి యనబడు నని పీఠిక యందు జెప్పబడినది. సుఖదుఃఖములు ముఖ్యముగా దేనిపైన ఆధారపడియున్నవి?

'సుఖదుఃఖాత్మకం మనః' అని మన శాస్త్రములు చెప్పి యున్నవి. సుఖదుఃఖములు మనస్సునకు చెందియున్నవి. ఈ సుఖదుఃఖములు భౌతికములైన విషయములకు సంబంధించి యున్నమాట నిజమే.

ప్రపంచములోని అర్థవస్తువులతో సంబంధము లేక సుఖదుఃఖములు జనింపవు. కాని ఒకే వస్తువు ఒకరికి సుఖమును, మఱొకరికి దుఃఖమును కలిగించుటను మనము చూచుచున్నాము. ఒకే మనిషికికూడ వేర్వేరు సమయములందు ఒకే వస్తువువలన భిన్నఫలములు సంభవించుచున్నవి. దేశకాలపాత్రములనుబట్టి, వ్యక్తియొక్క మనస్తత్వమును బట్టి అర్థవస్తువుల వలన కలుగు సుఖదుఃఖములు భిన్నములుగా తోచును. దేశకాలములను అధిగమించే శక్తి మానవునికిగలదు. తన మనసును వశము చేసుకొను శక్తికూడ కలదు. దుఃఖము వలన బాధ నొందకూడదనియు, సాధ్యమైనంతవఱకు సర్వమును సుఖాత్మకముగనే చూడవలయునను మానసికవృత్తిని మానవుడు అలవఱచుకొనక పోలేడు. అందుకు సరియగు దృష్టియు, విజ్ఞానమును, దీక్షయు కావలెను. తన సౌఖ్యమును తనతోటివారి అందరి సౌఖ్యమును కాంక్షింపవలెను. దుఃఖమును కలిగించే పరిస్థితులను సాధ్యమైనంతవఱకు తప్పించవలెను. సుఖమును కలిగించు పరిస్థితులను కల్పించుటకు మాత్రమే ప్రవర్తించవలయును. సిద్ధాంతరూపమున సరిగానే యున్నది.

గాని, దానిని ఆచరించుట ఎట్లు? అట్టి పరిస్థితుల కల్పించుటకు మానవసంఘ మేరీతిగా నుండవలెను? దానిని చక్కబఱచుటకు పూర్వము వివరింపబడిన పెట్టుబడిదారీ విధానము, సాంఘికవాదవిధానము పనికిరావా? పనికిరానిచో ఎందుకు పనికిరావు? అను విషయములు ఆలోచనీయములు.

పెట్టుబడిదారీవిధానమునందు కల లోపములను కొన్నింటిని యీదివఱకు వివరించి యుంటిమి. ఆ విధానమునందు వర్గ తారతమ్యము కలదు. ధనికులు కలరు. దరిద్రులు కలరు. జీవనము లేక అల్లాడుచున్నవారు కలరు. నిరుద్యోగులు కలరు. పనిలేనివారికి పని కల్పింపజాలకున్నచో, తిండిలేనివారికి తిండి పెట్టజాలకున్నచో, ఉద్యోగము లేనివారికి ఉద్యోగము నివ్వజాలకున్నచో, ఆ సాంఘికవ్యవస్థ చెడ్డ దని వేఱుగా చెప్పవలయునా? ప్రస్తుత నాగరిక దేశములలో అగ్రస్థానము వహించినదని పేరువడ్డ అమెరికాదేశమునందు 1939 లెక్కల బట్టి 6,240,000 నిరుద్యోగులు కలరు. పఠదిఅంతస్థుల సౌధములు గలవారు ఉండిరి. ప్రయోజన మేమి? నిరుపేదలు, జీవనము లేనివారు ప్రక్కన ఉండగా, వారి ఐశ్వర్యము ఐశ్వర్యమగునా? ఆ సంఘము ఉత్తమసంఘ మని చెప్ప వచ్చునా? వీలులేదు. ధనికులలోగూడ పరస్పరము పోటీలు, స్పర్థలు ఉన్నవి. ఒకరిని అణగద్రొక్కుటకు వేఱొకరు ప్రయత్నించుచున్నారు. అట్టివారికి శాంతి ఏది? పరస్పరము ద్వేషాసూయాభావములతో నిండిన వారికి శాంతిసౌఖ్యము లుండుట కల్ల. వారి మనస్సులు ఎప్పుడు తీవ్రమయిన ఆందోళనమును జెందియుండును. ఐశ్వర్య మున్నను సుఖము లేదు. సంపద

ఉన్నను శాంతి లేదు. శాంతి సౌఖ్యములు లేనిచో అభ్యుదయ మెక్కడ లభించును? కావున పెట్టుబడిదారీవిధానము, సాంఘిక అభ్యుదయసాధన మని చెప్పుటకు ఎంతమాత్రమును వ్వా వీలులేదు.

ఇక రష్యాదేశమున ఆచరింపబడుచున్న సాంఘికవాద పద్ధతిని పరిశీలింతము. మానవయోగక్షేమముల సమకూర్చుటలో పెట్టుబడిదారీవిధానముకంటె సాంఘికవాదవిధానము కడుంగడు మేలు అని నిశ్శంకముగా జెప్పవచ్చును. రష్యా దేశములో వస్తూత్పత్తి సాధనములు శ్రామికులసొత్తైనవి. వానియందలి హక్కులు, అధికారములు, శ్రామికులకే చెంది యున్నవి. గాని, ఎవరో కొందరు పెట్టుబడిదారులకు చెంది యుండలేదు. ధనికులు శ్రామికులను పీడించే అవకాశములు లేవు. నిరుద్యోగులు లేరు. అందరికి పనికల్పింపబడియున్నది. ధనికులు ఉన్నను పెట్టుబడిదారులు లేరు. స్వల్పవిషయములలో తప్ప స్వంతఆస్తియనునది లేదు. ఈ విధముగా క్రిందతరగతి వారికి రష్యాదేశము మేలు చేసినమాట నిజము. కాని మానవ వాభ్యుదయమునకు ఈపద్ధతి ఉత్తమపద్ధతియగునా? దీనికంటె కూడా మంచిపద్ధతి లేదా? యని విచారింపవలసియున్నది.

ఈ పద్ధతిని ఆచరణలో పెట్టుటకు హింసామార్గమవలంబింపబడినది. లక్షలాదిగ ప్రజలు చంపివేయబడిరి. ఈ పద్ధతిని అవలంబించని రాజకీయకక్షకు దేశములో స్థానము లేదు. ఈ పద్ధతికి చెందని వ్యక్తులు ఉండవచ్చును గాని, అక్కడ ప్రధాన రాజకీయకక్షయైన కమ్యూనిస్టుపార్టీ తప్ప వేఱొక రాజకీయకక్ష నెలకొల్పుటకు వీలులేదు. సర్వము ప్రభుత్వా

ధీనమైయున్న కారణమువల్లను, ప్రభుత్వము కమ్యూనిస్టుపార్టీ వారి వశమందుండుటవలనను, రాజకీయ స్వేచ్ఛాస్వాతంత్ర్యములు కొంతవరకు కుంటుపడియున్నవి. పెట్టుబడిదారీవిధానము గల దేశములలో రాజకీయమైన స్వేచ్ఛకలదు.

ఎన్ని రాజకీయకక్షలైనను ఉండవచ్చును. కాని ధనవంతులచేవలె యీ స్వేచ్ఛాస్వాతంత్ర్యములు ధనహీనులచే అనుభవింపబడజాలవు. ఆ దేశములలో నిజమైన స్వేచ్ఛాస్వాతంత్ర్యములు ధనవంతులకేగాని ధనహీనులకు లేవు. రష్యాదేశములో, కమ్యూనిస్టుపార్టీవారి కున్న స్వాతంత్ర్యావకాశములు ఆ పార్టీలో చేరనివారికి ఉండజాలవు. ఒక రాజకీయ భావమును ప్రచారము చేయవలయునన్న, ప్రస్తుత స్థితిగతులలో పార్టీబలముండవలయును. వ్యక్తులెంత సమర్థులైనను, పార్టీబలములేనిచో వారి ఆశయములు సఫలములు కాజాలవు. కమ్యూనిస్టుపార్టీలో చేరనివారికి సభలయందు మాట్లాడుటకు గాని, పత్రికలయందు వ్రాయుటకుగాని స్వేచ్ఛయుండి యుండవచ్చును. అంతమాత్రము చాలదు. పార్టీవ్యవస్థలేనిది, వారి భావములకు ఒకస్వరూపము ఏర్పడుటకు ప్రస్తుతసందర్భముల బట్టి వీలుండదు.

రష్యాదేశములో, వస్తూత్పత్తి ముఖ్యముగా భారీ పరిశ్రమలవల్ల జరుగును. పెద్దపెద్ద యంత్రాగారములుగలవు. ఒక్కొక్క యంత్రశాలయందు వేలకువేలు శ్రామికులు పని చేయుచుందురు. ఏ వస్తువు తయారగుచున్నదో శ్రామికులకు తెలియదు. వస్తు స్వరూపనిర్మాణము వారికి గోచరముకాదు. ఒక మేకుత్రిప్పుటో, ఒక బరువు ఎత్తుటో, ఒకలాగులాగుటో,

ఒక వస్తువు నందిచ్చుటతో మొదలగు పనిని శ్రామికుడు రోజు అంతయు చేయవలసి వచ్చును. పనియందు శ్రామికునకు అభిరుచిగాని, ఉత్సాహము గాని ఉండజాలదు. తనజీతమును సంపాదించుకొనుటకు ఆ పనిని విధిగా చేయవలసి యుండును. వస్తువు నిర్మాణమునందు మానవునికి ఆనందము కలదు. అట్టి ఆనందము జీవితములో ఒక ముఖ్యాంశము. అట్టి ఆనందమును పెద్ద యంత్రాగారములలోని శ్రామికుడు అనుభవింపజాలడు.

వస్తునిర్మాణమునందు కళాసృష్టి యున్నది. మనుష్యుడు చేయు పని సాధ్యమైనంతవఱకు కళాసృజనకు అనుకూలముగా నుండవలెను. కొయ్యతో పనిజేయు వ్రడంగి గాని, మట్టితో పనిచేయు కుమ్మరిగాని, రాతితో పనిజేయు శిల్పిగాని తన భావానుగుణమైన వస్తువును, ఆ యా పదార్థములలో నుండి నిర్మించును. ఆ నిర్మాణమునందు కళానైపుణ్యమునకు ఎంతయో అవకాశ ముండును. అతని సృజనశక్తికి చక్కని అనువైన పరిస్థితులు ఉండవలెను. పెద్దపెద్ద యంత్రములయందు పని చేయువారికి అట్టి అవకాశములు ఉండజాలవు. నిర్మిత వస్తు స్వరూపమునకున్నూ, శ్రామికునకున్నూ ఎట్టి సంబంధమును ఉండదు. యంత్రములో ఒకభాగమైన మరవలెనే శ్రామికుడు కూడ నగును. అతని మానవత్వము, సృజనశక్తియు కొఱత బడును. అయితే ఇట్టిస్థితి పెట్టుబడిదారీపద్ధతియందును కలదు. పెద్ద యంత్రశాలలు ఎక్కడ నుండునో, అక్కడ ఇట్టిదే సంభవించును.

పెద్దపెద్దయంత్రములు సాంఘికవాద పద్ధతినిబట్టి అవసరములు. ఆ పద్ధతిప్రకారము మానవులకు ఎక్కువ విశ్రాంతి

కావలయును. విశ్రాంతి యెక్కువయున్ననేగాని, అతని మన శ్శక్తులు విజృంభింపనేరవు. లలితకళలయందు అతనికి అవకాశ ములు లభించవు. అట్టి విశ్రాంతి కావలయునన్నచో పెద్దయంత్ర ములు ఆవశ్యకములు. పెద్ద యంత్రములవల్ల ఉత్పత్తి ఎక్కువ యగును. మనుష్యులకు కావలసిన వస్తువులు విరివిగా ఉత్పత్తి యగును. తక్కువకాలములో ఎక్కువ వస్తువులు తయారు చేయబడును. కొద్దికాలములో చేసినందువల్ల మనుష్యులకు అవసరమైన వస్తువులు విరివిగా లభించి మిగతాకాలమును వారు లలితకళల నుపాసించి ఆనందజీవనమును గడపగలరు. కావున ఖారీపరిశ్రమలున్నా, వానియందు యావత్తు సంఘము అనగా ప్రభుత్వము హక్కుకలిగియుండుటయున్నా, సంఘ శ్రేయస్సుకు ఎంతయు అవసర మని సాంఘికవాదపద్ధతి వారియొక్క వాదన అయియున్నది.

పనిచేయుకాలమందు, పెద్దయంత్రశాలలలో పనిచేయు వారికి ఆనందమే ఉండజాలదని పైన నిరూపించియున్నాను. ఇక పని లేనికాలమందు వారు సుఖముగా కాలము గడుప గలరా? అప్పుడు వారు సినిమాలకు, నాటకాలకు, సంగీత శాలలకు, మొదలైన స్థలములకు వెళ్ళి ఆనందముగా కాలము గడుపగలరు అని సాంఘికవాదులు చెప్పుచున్నారు. దీనిని కొంచెము శ్రద్ధగా పరిశీలించవలసియున్నది. తండ్రితాతలు సంపాదించిన ఆస్తులు విరివిగాకలిగి, సోమరిపోతులై చెడిపోయిన వారిని ఎందఱినో మనము చూచుచున్నాము. వారికి ఐశ్వర్య మున్న కారణమువలన, విషయలోలురై వారు భ్రష్టులగు టయు, మన మెఱుంగుదుము. అయితే అందరు భ్రష్టులగు

చున్నారా? సత్పురుషులు ఎందఱులేరు? అట్టివారు ఎందఱు సుఖజీవనము చేయుటలేదు? అని అడుగవచ్చును. అట్టివారు కొందఱుండవచ్చును. కాని మానవస్వభావమును పరిశీలించి నచో జీవితావసరములకై కర్మచేయు నవసరములేనికాలము నందు, మానవులు సోమరులై చెడిపోవుటకు అవకాశములు ఎక్కువున్నవిగాని, బాగుపడుటకు అంతగా లేవు. అయితే రష్యాలో వారందరు చెడిపోవుచున్నారా? అని అడుగ వచ్చును. రష్యాలో యీ నూతనపరిణామమును వచ్చి, కొలది సంవత్సరములే అయినవి. దానియొక్క గుణాగుణము లను వర్ణించుటకు కాలవ్యవధిచాలదు. సిద్ధాంతరీత్యా వారు చెప్పే పరిస్థితులు యింకా రష్యాలో కూడా లభించ లేదు. రాజ్యాంగవ్యవస్థ క్రమముగా వాడి, ఎండిపోయి అంతరించిన నాడు రాజ్యాంగరీత్యా రష్యా గమ్యస్థానముచేరినట్లు ఎంచ బడును.

అదిన్నీగాక యింద్రియలోలత్వమును వృద్ధిచేయు కర్మ వలన మానవుడు చెడిపోవును. ఫలవాంఛారహితమైన కర్మ యందు నిజమైనట్టియు, స్థిరమైనట్టియు ఆనందముకలదు. కేవలము యింద్రియసుఖానుభూతికై ఏర్పడిన విశ్రాంతి వలన మానవుడు ఉన్నతస్థితికి పోజాలడు. సృజనశక్తియు, నిర్మాణ శక్తియు మానవుని ఉత్తమలక్షణములు. ధర్మానుగుణములై అర్థములను సృజించి, నిర్మించుటయందు మానవుని శక్తి దీపించ వలెను, అందు కనువగు కర్మకౌశలము నిచ్చు వ్యవస్థయే ఉత్తమ వ్యవస్థ యగును. సాంఘికవాదులు చెప్పే విశ్రాంతివలన అట్టిది ఏర్పడదు.

మానవుని సృజన నిర్మాణశక్తులను ఉద్దీపింపజేయగలిగిన సామర్థ్యము పెట్టుబడిదారీవిధానమునందు గాని, సాంఘికవాద విధానమందుగాని లేదు. అందుకు తగిన వ్యవస్థ యీసిద్ధాంతమున నున్నదికి గాంధీవాదసిద్ధాంతము నందున్నదని చెప్పవచ్చు. ఈ సిద్ధాంతమునుబట్టి పెద్దయంత్రశాలలకంటె, గృహపరిశ్రమలకే ప్రధానస్థానమున్నది. మానవుని ముఖ్యావసరములకు కావలసిన అర్థవస్తువులు, సాధ్యమైనంతవరకు గృహపరిశ్రమల వల్లనే ఉత్పన్నమగును. నాగలితో భూమిని దున్ని, విత్తులు నాటి, పంటపండించి, సంఘమునకు రైతు ఆహారమును సేకరించును. రాట్నముమీద నూలువడికి, ఆ నూలుతో నేసేత పారిశ్రామికుడు బట్టను నేసి, సంఘమునకు వస్త్రసమృద్ధిని చేకూర్చును. మంటితో కుండలను తయారుచేసి కుమ్మరియు, లోహములతో గిన్నెలను తయారుచేసి లోహకారుడును, అన్నవచనములకు కావలసిన సామగ్రి తయారుచేయుదురు. వడ్రంగియు, శిల్పియు, నిర్మాణమును చేయుదురు. ఈవిధముగా ఎవరెవరి కర్మలయందు ఆయా వృత్తులవారు తమ పరిశ్రమ, బుద్ధివికాసమును, కర్మకౌశలమును, నిర్మాణశక్తిని వినియోగించి సంఘమునకు శ్రేయముసుగూర్చి తమ శాంతిసౌఖ్యముల ననుభవించెదరు. ఈ సిద్ధాంతమునందు పెద్ద ధనికులుండరు. నిరుపేదలును కానరారు. అందరికి జీవనోపాధియుండును. నిరుద్యోగమన్నది కానరాదు. వారిజీవితము ఆనందమయముగానుండును. వస్తునిర్మాతకున్నా, వస్తువినియోజకునకున్నా పరిస్పరసంబంధములున్న, ప్రేమయున్నా, సౌహార్దమున్న కలవు. శ్రామికుని కర్మకౌశలమును, వినియోజకుడు మెచ్చు

కొని ప్రేమించును. వినియోగకుని అభిరుచి కనువగు వస్తువులను ఉత్పాదకుడు తయారుచేయును. ఈవిధముగా ఒకరియెడల నొకరికి ప్రేమయు, ఒకరిమీద మరొకరు సన్నిహితముగా ఆధారపడుటయు సంభవించి, ఒకరినొకరు హింసించుట అనే భావమే అంతరించును. అందువలన దీనిని అహింసాపద్ధతి యందురు. ఈ మార్గము మన ప్రాచీన సంప్రదాయమునకు అనురూపమైనది. అయినప్పటికీన్నీ, పాశ్చాత్య నాగరికతా వ్యామోహితులైన భారతీయులయొక్క దృష్టిపథమునుండి అంతరించినది. తిరిగి గాంధీమహాత్ముడు ఈ మార్గమును పునఃసృష్టి చేయుచున్నాడు.

గాంధీవాదము భారీపరిశ్రమలకు వ్యతిరేక మనియు, మానవుని తిరిగి అనాగరికస్థితికి తీసికొని పోవుచున్నదనియు కొందరు వాదించుచున్నారు. గాంధీవాదము భారీపరిశ్రమలకు విరోధికాదు. నిత్యావసరములకు గృహపరిశ్రమలమీదనే ఆధారపడవలయు ననియు, ప్రస్తుతప్రపంచస్థితులనుబట్టి అవసరమైనట్టి మిగతాకార్యములకు మాత్రము భారీపరిశ్రమలను పెట్టుకొని ప్రభుత్వపరము చేయవలయుననియు, యీ సిద్ధాంతముయొక్క తాత్పర్యము.

# మూడవ అధ్యాయము

## సిద్ధాంత పరిశీలనము

మానసికవృత్తులైన శాంతి, సౌఖ్యము అనేవాటినిబట్టి పెట్టుబడిదారీవిధానము, సాంఘికవాద విధానము, అహింసా విధానము అనే మూడుపద్ధతులను కొంతవఱకు విమర్శించి యున్నాము. కాని, ఆర్థికసూత్రములదృష్ట్యాకూడా వీనిని పరిశీలించవలసియున్నది. ఆర్థికశాస్త్రమునుబట్టి అర్థవస్తువుల యొక్క ఉత్పత్తి, వాని వినియోగము ముఖ్యములైన విషయములు. మనుష్యుడు తనకోర్కె నెరవేర్చుకొనుటకు వస్తుసముదాయము కావలెనుగదా! అట్టి వస్తువులు నిర్మితము లగుట, నిర్మితములైన వస్తువులు కావలసినవారిచే వినియోగింపబడుట అనునవి ఆర్థికశాస్త్రరీత్యా ముఖ్యాంశములు. తనకోర్కెలను తృప్తిపరచుటకై విశేషముగా, విరివిగా మానవుడు వస్తువులను అర్థించుచున్నాడు. విరివిగా వస్తువులను ఉత్పత్తిచేయుటకు చినచిన్న పరిశ్రమలు సాధకములుగావు! భారీపరిశ్రమలు అత్యంతము అవసరము. చేతిపరిశ్రమలద్వారాకంటె భారీ యంత్ర పరిశ్రమలద్వారా వస్తువులను అనేకరెట్లు విరివిగా తయారుచేయవచ్చును. సమృద్ధిగా వస్తువులు లభించగలవు. లేకున్న, కొద్దివస్తువులతోనే మనుష్యులు తృప్తిచెందవలసి వచ్చును. వారి కోర్కెలు నెరవేరజాలవు. కోర్కెలు నెరవేరకున్నచో వారు దుఃఖభాజను లగుదురు. కావున వస్తూత్పత్తి సాధనయందు భారీపరిశ్రమలు, చేతిపరిశ్రమలకంటె అనేక

గావున తమకోర్కెలను ప్రజలు నెరవేర్చుకొనుటకు ఎక్కువ అవకాశములు కలవు. అయినను వినియోజకులకోర్కెలు యీ రెండు విధానములయందు పూర్తిగా సిద్ధించనేరవు. "లోకో భిన్నరుచిః" అనే వాస్తవిక సూత్రములనుబట్టి చూచినచో ప్రజల అభిరుచులు భిన్నభిన్నములుగా నుండును. ఆ రుచులు కూడా తఱచుగా మారుచుండును. ఆ యా రుచులకు అనువైన వస్తువులు ఉత్పత్తిగాకున్నచో, వారి యభీష్టములు సంసిద్ధి నొందవు. పెద్దపెద్దయంత్రములవల్ల తయారయ్యే వస్తువులు ఒక మూసలోపోసి తీసినట్లుండును. మనుష్యులయొక్క అభిరుచులలో మార్పులు వచ్చినంత త్వరగా, యంత్రముల మార్చుటకు వీలులేదు. ఒక్కొక్క యంత్రమును తయారు చేయుటకు ఎంతోకాలము పట్టును. ఆ యంత్రము తయారయ్యే సరికి, దానివలన ఉత్పత్తిఅయ్యేసరకులయందు ప్రజలకు అభిరుచి తగ్గిపోవచ్చును. అప్పుడు విధిలేక, గత్యంతరములేక, ఆవస్తువులనే వినియోజకులు ఉపయోగించుకొనవలసివచ్చును.

ఖాదీపరిశ్రమలబట్టి వస్తువులయొక్క ఉత్పత్తి విరివిగా లభించినను, వినియోజకులయొక్క భిన్నభిన్నములైన అభిరుచులబట్టి వారికి సరియైన తృప్తి నివ్వజాలవు. తాను కోరిన వస్తువు కొంచెమైనను, కోరనివస్తువుయొక్క సమృద్ధికంటె, మనుష్యునికి ఎక్కువ సంతృప్తి చేకూర్చుననుట లోకవిదితమున్ను, అనుభవవేద్యమున్ను అయియున్నవి. కావున, వినియోగదృష్ట్యా పెట్టుబడిదారీ విధానముకంటె సాంఘికవాద విధానము శ్రేష్ఠతరమైనది. వినియోజకుని సంతుష్టిదృష్ట్యా లోపయుతమని చెప్పకతప్పదు. ఉత్పత్తివినియోగములయొక్క

లాభముల పురస్కరించుకొనియే అహింసావిధానమును పరిశీలింతము. తక్కువకాలములో, తక్కువమంది మనుష్యుల యొక్క పరిశ్రమతో, ఎక్కువ వస్తువులను తయారు చేయుటలో శారీరపరిశ్రమలకు చేతిపరిశ్రమలు సాటిరావనుమాట నిజము. అయితే ఉత్పత్తి విధానముయొక్క లక్ష్యము అది మాత్రమేగాదు. ఎక్కువ వస్తువులను తక్కువకాలములో తక్కువపరిశ్రమతో ఉత్పత్తిచేయుట తాత్కాలికముగ ఉపయోగకరమైనట్లు కన్పించినను, దీర్ఘదృష్టితో ఆలోచించిన యెడల అది సరికాదు.

వినియోగజనులకు కావలసినంతవరకే ఉత్పత్తి యవసరముగాని, అక్కరలేని ఉత్పత్తి నిరర్థక మగును. ఇక్కడ ఒక ముఖ్యమైన సమస్య పుట్టుచున్నది. మనుష్యుని అవసరములను మితముగా ఉంచుకొనుట అవసరమా? లేక అమితముగా పెంచుకొనుట మంచిదా? కోర్కెలను పెంచుకొనుకొలదియు, వాటినితీర్చ సాధనములకై ప్రయత్నము చేయవలసియుండును ఆ సాధనములు లభించనిచో, జీవితము దుఃఖమయ మగును. కోర్కెలను తగ్గించుటకు ప్రయత్నించువానికి హాయికలదు. నివసించుటకు దివ్యభవనము కావలె నని కోర్కె పొడమినచో సౌధనిర్మాణము జరుగువఱకును ఆ పురుషునికి శాంతి లేదు. జరుగకున్న దుఃఖమే ప్రాప్తించును. జరిగినను ఆ సౌధమునకు ఎక్కడ ఎంతమాత్రము లోపము సంభవించినను మిక్కిలి కష్టముకలుగును. సౌధము అక్కరలేదు. తలదాచుకొనుటకున్ను, వాతాతపముల, శీతోష్ణములయొక్క బాధలనుంచి తప్పించుకొనుటకున్ను చిన్నగృహము చాలునని, తృప్తుడైన

మానసికముగా కలిగెడు లాభములనన్నిటిని మనసులో నుంచుకొని ఆలోచించినయెడల నష్టములకంటె లాభములే ఎక్కువగా కానవగును.

భారీపరిశ్రమలయందు పనిచేయువారు, యంత్రముల లోని మరలవలె ఉపయోగపడ రనియు, వారియొక్క మానవత్వము, వ్యక్తిత్వము, మానసికానందము కుంటుపడుననియు యిదివరకే నిరూపించియున్నాము. అంతియేగాక వారియొక్క నైతికజీవనమునకు, ఆరోగ్యమునకుకూడ భారీపరిశ్రమలు ప్రతిబంధకములని చెప్పవలసియున్నది. ఒక్కొక్కపరిశ్రమయందు వేలకువేలు స్త్రీపురుషులు కలసి మనస్సు పనియందు లగ్నమయ్యే పరిస్థితులు లేని సందర్భములో, వారి నైతికజీవితమునకు కళంకము రావచ్చును. అంతమాత్రముచేత అందరు చెడిపోవుదురని చెప్పుట నా అభిప్రాయము గాదు. నైతికజీవనము మలినము కాగల సందర్భములు ఎక్కువ యగును. కాబట్టి పొరబాటులు జరుగుటకు ఎక్కువ అవకాశము లుండును. అదిన్నిగాక, వారి ఆరోగ్యముకూడ భంగము కావచ్చును. ఎన్నిసౌకర్యములు చేసినను అంతమంది ఒకేచోటగూడి పని చేసినచో, చక్కని ఆరోగ్యము ఉండజాలదు. ప్రకృతిసమీరుని ఆఘ్రాణించి సూర్యభగవానుని కిరణములు స్పృశించినవాని ఆరోగ్యము యంత్రాగారములయందు పనిచేయువానికి ఎట్లు లభించును?

కావున తత్వమును పరిశీలించినచో, భారీపరిశ్రమల వలన ఉత్పత్తివిధానముకంటె, చేతిపరిశ్రమలవలని ఉత్పత్తి విధానము శుభాపహామని చెప్పకతప్పదు. ఇందువలన భారీ

పరిశ్రమలుగాని, యంత్రాగారములనుగాని నిరసించుట అని అనుకొనరాదు. చేతిపరిశ్రమలవలన లభ్యమైనంతవరకు వానిని ఉపయోగించవలెను. లభ్యముగాని విషయములందు భారీ పరిశ్రమలను ఉపయోగించక వీలులేదు. ప్రయాణమునకు, రవాణాసౌకర్యములకు రైళ్లు కావలెను. రైళ్ళు, ఇంజనులను చేతిపరిశ్రమలద్వారా చేయుట సాధ్యమగునా? కాదు. కాబట్టి అట్టివాని విషయములో భారీపరిశ్రమలు అవశ్యము అంగీకార్యములు. కాని పెట్టుబడిదారీవిధానమునందువలె గాక, వానిని ప్రభుత్వమే వశముచేసుకొని ఉత్పత్తిచేయవలెను.

# నాల్గవ అధ్యాయము

## చరఖా లేక రాట్నము

పూర్వాధ్యాయములోని విమర్శనము వలన, అన్ని పద్ధతుల కంటెను మానవకళ్యాణమును చేకూర్చుటకు అహింసా పద్ధతియే ఉత్తమమైనదని తెల్లమయ్యెను. పరిశ్రమలదృష్టిలో చూచినయెడల, యీ అహింసావిధానమునందు, చరఖా లేక రాట్నము అనునది అగ్రస్థానము నాక్రమించుచున్నది. వ్యవసాయమువలన ఆహారములభించుచున్నది. క్షుద్బాధా నివృత్తికై ఆహారము అవసరము. దాని తరువాత మానవునికి ముఖ్యావసరమైనది వస్త్రమే. వస్త్రనిర్మాణమునకు అహింసావాదము ప్రకారము చరఖాయే ఉత్కృష్ట సాధనమని చెప్పబడుచున్నది. పాశ్చాత్యనాగరికతనుబట్టి ప్రస్తుతకాలము యంత్రయుగమని చెప్పబడుచున్నది. యంత్రయుగమనగా నేమి? యంత్రములు చేయుపని ఎయ్యది? బట్టలు మొదలైనవానిని నిర్మించుటకు పెద్దపెద్ద కర్మాగారములను మనము చూచుచున్నాము.

నూలుగాని, వస్త్రములనుగాని నిర్మించే యంత్రశాలలు, మన మద్రాసు రాజధానిలో 55 గలవు. కోయంబత్తూరు, మధుర, మద్రాసు ప్రాంతములయందు ఆ యంత్రశాలలు నిర్మింపబడి యున్నవి. ప్రకృతిశక్తులను విశేషముగా ఉపయోగించుకొన గల్గుటయే, ప్రస్తుత యంత్రయుగము యొక్క నాగరికతకు మూలాధారము. ఏ దేశము యీ శక్తులను విశేషముగా ఉపయోగించుకొనగలుగు చున్నదో, ఆ దేశము ప్రపంచములో ప్రధానస్థానము నాక్రమించుచున్నది. ప్రకృతిశక్తులను ఉపయోగించుకొనుటకు ఏర్పడిన సాధనములే యంత్రములు. సాధనములలో అనేకమైనవి ఉండవచ్చును, ప్రకృతిశక్తులను ఉపయోగించుటకు ఏ సాధనము ఉత్తమమో మనుష్యులు నిర్ణయించుకొనవలసి యున్నది. సాధనములు మంచివియైనను, వానిని ఉపయోగించే పద్ధతిమీద మానవకళ్యాణము ఆధారపడియుండును. పర్వతములను ఛేదించి, మార్గమును సుగమముగా చేయజాలిన తుపాకిమందు మనుష్యులను, ప్రపంచమును ధ్వంసము చేయుటకు ఉపయోగింపబడుటను మనము చూచుచునే యున్నాము. కావున ప్రకృతిశక్తిని ఉపయోగించుటకై నిర్మించుకొన్న సాధనవిశేషములనుబట్టియు, ఆ సాధనములను వినియోగించుకునే పద్ధతినిబట్టియు లోకకళ్యాణము సిద్ధించుచున్నది.

ప్రకృతిశక్తికి ఆధారభూతమైనవాడు సూర్యపరమాత్మ. ఆయననుండియే తేజోరూపమైనశక్తి ఆవిర్భవించుచున్నది. తనకిరణముల చేత సముద్రజలములను ఆవిరిగా మార్చి, మేఘముల నిర్మించి సస్యాధారమైన చక్కని వర్షపాతమును

ఆ సూర్యభగవానుడే యిచ్చుచున్నాడు. ఆ వర్షపాతముచేత, సస్యములుపండి, సమస్తజీవరాశికి ఆహారమును కల్పించుచున్నవి. ఆహారభక్షణమువలెనే జీవకోటి తన యాత్రను సాగించగలుగుచున్నది. అందువలననే సూర్యునికి 'సవితృ' శబ్దము, సంస్కృతమున యోగరూఢమైయున్నది. శక్తిని ప్రసరించును గనుకనే సవిత యని సూర్యుడు పిలువబడుచున్నాడు.

శాస్త్రరీత్యా పరికించినచో, సూర్యశక్తిని లేక సూర్యతేజస్సును మిక్కిలిగా ఉపయోగించుకొనగల వ్యవస్థ మానవ కళ్యాణమునకు దోహద మొసంగగలదు. సూర్యతేజస్సువలన ఆహారపదార్థములు ఉత్పత్తియగును. వానిని భుజించుటవలన జీవులకు శక్తి కలుగును. ఆ శక్తివలన జీవులకు సమస్తలౌకిక వ్యాపారములను చేయగలుగుచున్నారు. ఆ శక్తివలననే, మనుష్యులు తమ కవసరములైన అనేకవస్తువులను ఉత్పత్తిచేయుచున్నారు.

మనదేశమున వస్త్రోత్పత్తికి పెద్దయంత్రములు అవసరమా కాదా యని విచారింతము. ఆ యంత్రములు అయినను ప్రకృతిలోని శక్తిని ఉపయోగించుకొనవలసినదే. ఎట్లనగా బట్టలమిల్లు నడుపుటకు పెద్దయంత్రములు కావలెను. ఆయంత్రములకు యినుము కావలెను. ఇనుమును భూగర్భములోనుంచి తీయుటకు పరిశ్రమ కావలెను. యంత్రములునిర్మించినతరువాత వాటిని నడుపుటకు బొగ్గు మొదలైనవి కావలెను. ఆ బొగ్గుగనులు భూగర్భముననున్నవి, వానిని పైకితీయవలెను. ఈపనులు చేయుటకు శక్తిని వినియోగించవలయును. ప్రకృతిగర్భమున దాగియున్న బొగ్గు, యినుము, మొదలైనవానికి బదులుగా

వానిని వినియోగించనక్కరలేకుండానే పనిలేకయున్న మను ష్యులయొక్క చేతిపరిశ్రమలవలన, వస్త్రోత్పత్తి చేయుట మేలని వేఱుగా చెప్పనక్కరలేదు. అందులో ముఖ్యముగా భారత దేశమువంటి విశాలదేశములో కోట్లకొలది ప్రజలు, తినతిండి లేక, కట్టుబట్టలేక, చేయుటకు పనిలేక అల్లాడుచుండగా వారి యొక్క శక్తిసంపదను ఉపయోగించి వస్త్రమును ఉత్పత్తి చేయుట కడు లాభదాయకము. మనదేశమున అనాదికాలము నుంచియు, వస్త్రపరిశ్రమ మిగుల ఉన్నతస్థితిలో నుండెను. బ్రిటిషు పరిపాలన వచ్చిన కొంతకాలమువఱకు, ఉన్నత స్థాన ములోనుండి వారిపాలన సాగిన కొంతకాలమునకు వారుచేసిన ఘాతుకకృత్యములవలన, మనవస్త్రపరిశ్రమ నన్నగిల్లెను. అదినీన్ని గాక, రాట్నమునీద నూలుతీయుట, మగ్గమునీద నేయుట మొదలగు విద్యలు మనదేశములో పూర్వమునుండియు విల సిల్లినందున, నేర్చుకొనువారికి సులభముగా లభించును. నేర్చిన వారుకూడా అనేకమందికలరు. ఇవిన్నీగాక వీరికిరాట్నములు, మగ్గములు సరఫరాచేసి వస్త్రపరిశ్రమ వృద్ధిచేయుటకు పెద్ద పెద్ద పెట్టుబడిధనము అక్కరలేదు. ఒక పెద్ద వస్త్రయంత్రము నిర్మించవలెనన్న లక్షలకొలది పెట్టుబడికావలయును. చేతిపరి శ్రమకు అంతగా పెట్టుబడిధనము అక్కరలేదు. వీరికి ఆహా రముతప్ప యంత్రములవలె బొగ్గు మొదలయిన గనులతో నిమిత్తములేదు. కావున సూర్యభగవానుడు కారణముగా అతని తేజశ్శక్తివలన ఆవిర్భవించిన ఆహారమును తినుటచేత కలిగిన, మనుష్యశక్తిని మాత్రమే ఉపయోగించుకొని మన దేశవస్త్రసంపదను తేలికగా మనము పరిష్కరించుకొనవచ్చును.

భౌతికశాస్త్రపరిశోధకులు సూర్యశక్తిని కొలుచుటకు ఉపాయములు కనిపెట్టియున్నారు. ఈశక్తి భూమిమీద గజమునకు ఎంతకున్నో లెక్కలు వేసియున్నారు. ఈశక్తిని కొలిచే ప్రమాణమును Horse power అని అందురు. ఈ పదమునకు సరియైన ఆంధ్రపదము నాకు తోచలేదు. 'శక్తిప్రమాణము' అనుపదము ఉపయోగింపదలచితిని. ఒక నిమిషమునకు 1.7 శక్తి ప్రమాణము సూర్యునివద్దనుంచి భూమిమీద పడునని శాస్త్రజ్ఞులు అంచనావేసిరి. దానినిబట్టి గుణించిన యెడల ఒకసంవత్సరమునకు మన భారతదేశముమీద పడునట్టి సూర్య తేజము 58,601,685,904,000,000 శక్తిప్రమాణములు అని లెక్కవేయబడినది. ప్రపంచములోని అన్ని బొగ్గుగనులలో నున్న బొగ్గువలన ఉత్పత్తి అగు శక్తిప్రమాణములకంటె మన దేశములో పడెడు సూర్యశక్తి 207000 రెట్లు ఎక్కువ అని అంచనా వేయబడినది.

1921 సంవత్సరపు జనాభా లెక్కలబట్టి బర్మాదేశమును మినహాయించగా కేవలము వ్యవసాయముమీదనే ఆధారపడి సరిగా పనిచేయగల స్త్రీ పురుషుల సంఖ్య సుమారు 107,000,000 ఉండునని అంచనా వేయబడినది. ఒక శక్తి ప్రమాణములో 1/6 మొదలుకొని 1/10 వఱకు మనుష్యుడు తన చేతిపరిశ్రమవలన శక్తిని ఉపయోగించగలడని శాస్త్రజ్ఞులు చెప్పియున్నారు. కనుక 107,000,000 మనుష్యులు 1/10 వంతున పనిచేయగలిగినను, 10,700000 శక్తిప్రమాణముల వల్ల జరిగేపనిని చేయగలుగుదురు. రాట్నముద్వారా ఒకవ్యక్తి తనకున్న మొత్తము శక్తిప్రమాణములలో 1/100 వంతు

మాత్రమే ఉపయోగించబడెనని ఎంచినను, మొత్తముమీద 107,000 శక్తిప్రమాణములవలన ఉత్పత్తికాగల నూలును 107,000,000 ప్రజలు ఉత్పత్తిచేయగలరని చెప్పవచ్చును. ఈలెక్కలో వృద్ధులను, పిల్లలనుచేర్చలేదు. వారినికూడా చేర్చిన యెడల శక్తిప్రమాణములసంఖ్య యింకా పెరుగగలదు. 1920 సంవత్సరపు లెక్కలనుబట్టి చూచినచో బొంబాయిలో నున్న యంత్రాగారములలోని అన్ని యంత్రములయొక్క శక్తిప్రమాణములు 58000 కంటె లేవు. కాబట్టి ఎట్టి పెట్టుబడిగాని, గనులుగాని అక్కరలేకుండా, పనిలేకుండా ఉన్న వయోజనుల చేతిపరిశ్రమవల్లనే బొంబాయిలోని అన్ని మిల్లులకంటె రెట్టింపు శక్తిప్రమాణమును ఉపయోగించుకో వచ్చునని అంచనా చేయబడినది. ఈ కారణములవలన పెద్ద యంత్రములకంటె రాట్నమే మేలు అని తేలుచున్నది.

పెట్టుబడినిగూర్చి విచారింతము. 1925 సంవత్సరపు లెక్కలనుబట్టి 20,000 కదుళ్ళుగల యంత్రములను నిర్మించుటకు 1661000 రూపాయిలు ఖర్చు అగును. ఒక్కొక్క రాట్నము ఖర్చు 5 రూపాయ లగునని యెంచినయెడల యీ మొత్తమునకు 332200 రాట్నములువచ్చును. 20 వేల మరకదుళ్ళమీద కంటె అదేడబ్బుతో సంపాదింపబడిన 332200 రాట్నముల, మీద షుమారు పది లేక పదునాలుగురెట్లు ఎక్కువనూలు లభించగలదు.

అటులనే మరమగ్గముల ఖరీదు రూ. 900 అగుచో, చేతిమగ్గము ఖరీదు 20 అగును. ఈ లెఖలుకూడా 1925 సంవత్సరపు ధరలనుబట్టి నిర్ణయించబడినది. కనుక ఒక మరమగ్గమున

కయ్యే ఖర్చుతో 45 చేతి మగ్గములను సంపాదింపవచ్చును. ఒకసంవత్సరము ఒకే మరమగ్గముమీద 12000 గజముల బట్ట తయారగును. ఒక చేతిమగ్గముమీద 1200 గజముల బట్ట తయారగును. 45 మగ్గములమీద 45 × 1200=54000 వేల గజముల గుడ్డ తయారగును. అనగా షుమారు 4½ రెట్లు ఎక్కువ వస్త్రము ఉత్పత్తియగును. కావున తక్కువధనముతో ఎక్కువ ఉత్పత్తిచేయుటకు పెద్దయంత్రములకంటె రాట్నము చేమగ్గములే ఉపయోగకరములు.

పెద్ద యంత్రములకు మరమ్మతులకై యెక్కువగా ఖర్చు చేయవలసియున్నది. రాట్నములకు అంతగా ఖర్చు చేయ నవసరము లేదు. ఖర్చుమాత్రమే కాదు. యంత్రముల మరమ్మతు చేయుట కష్టమైన పని. కొద్దిమంది తర్ఫీతుపొందిన వారికి మాత్రమే అది సాధ్యమగును. రాట్నముల మరమ్మతు చేయుటకు ఏ వడ్రంగియైనను సమర్థుడగును.

యంత్రములకు కావలసిన సామగ్రిని విదేశములనుండి దిగుమతి చేయవలసివచ్చును. ఆ ధనము విదేశీయులకే సంక్రమించును. యంత్రసామగ్రిని అమ్మినవారికి వారి దేశముల తాలూకు కరెన్సీని యివ్వవలసియుండును. దానికొఱకై వారిని ఆశ్రయించి వారివద్ద ఋణములు తీసికొనవలసి వచ్చును. ఋణము పుచ్చుకొన్నవాడు, ఋణదాతకు బానిసయగునట్లు మనకు తెలిసిన విషయమే. కావున విదేశములనుండి ధనసహాయము సంపాదించుటకు పడవలసిన కష్టములెల్లా తేటతెల్లము, అనేకులు ప్రజా జనులు పనిలేనివారై యుండిరి, వారికి పని కల్పించుట అవసరమైనందుననేమి, బొగ్గు, ఇనుము మొదలయిన ఖనిజములను

వినియోగించ నవసరము లేకుండా, మనుష్యులవద్ద లభించెడి శక్తిప్రమాణములు బట్టియే ఉత్పత్తిచేయుటకు అవకాశము లుండుటనుబట్టి యేమి, మనదేశపరిస్థితులకు యంత్రములకంటె రాట్నము, మగ్గమే వస్త్రోత్పత్తివిషయములో మిక్కిలి శ్రేయోదాయకములు.

# ఐదవ అధ్యాయము

## నిరుద్యోగసమస్య

ఏ సాంఘికవ్యవస్థయైనను సుస్థితిలో నుండవలెనన్న ప్రజలందఱికి ఉద్యోగముండవలెను. ఉద్యోగమనగా కచేరీలలో పనిచేయుట మాత్రమేగాదు. ఉద్యోగ మనగా పనికలిగి యుండుట. దుష్టమార్గముల నవలంబించి చేసినపని పనిగాదు. సంఘమునకు క్షేమకారకమైన పనియే ఉద్యోగ మని చెప్పబడును. ప్రజలందరు సంఘోపకారకమైన కర్మ చేయునెడల అర్థోత్పత్తి ఎక్కువగుటయేగాక, వారి ఆత్మాభివృద్ధికి కూడ తోడ్పడును. పనిలేనివాడు, సోమరియై చెడిపోవునని పూర్వమున చెప్పబడియే ఉన్నది. ఒకదేశములో చాలమంది నిరుద్యోగులు అయినయెడల మొత్తముమీద ఉత్పత్తి తక్కువ అగుటయేగాక, ఉత్పత్తి అయిన వస్తువులు కొనగల సామర్థ్యము వారి కుండజాలదు. పెద్దయంత్రముల స్థాపించి ఉత్పత్తి ఎక్కువ చేసికొని వినియోగించువారు లేనియెడల ఉత్పత్తి అంతయు వృథాయగును. వినియోగములేని ఉత్పత్తివలన కీడుగాని మేలులేదు.

ఉద్యోగమనగా పనికలిగియుండుట. నిరుద్యోగమనగా పనిలేకయుండుట, పనిలేకుండుటలో అనగా నిరుద్యోగములో

అనేకవిధములున్నవి. సర్వకాలము పని లేకుండుట, కొంతకాలము పనికలిగి, మఱికొంత కాలము పని లేకుండుట, పనియున్న దినములలోకూడా దినమంతయు పని లేకుండ మొదలగు విధములు కలవు.

పని చేయదగిన వయస్సులోనుండి సర్వకాలము పని చేయుటకు అవకాశములు లేనివారిసంఖ్య 10 కోట్ల 70 లక్షలు అని 1921 సంవత్సరపు లెక్కలవల్ల తెలినదని లోగడనే తెలిపియున్నాము. ఇతర దేశములతో పోల్చినయెడల మన భారత దేశములో నున్నంతగా నిరుద్యోగము ఏ దేశమునందును లేదని తెలియుచున్నది. దీనివలన మన దేశమునకు ధనరూపముగా ఎంత నష్టము వచ్చుచున్నది షుమారుగా తెలిసికొనదగియున్నది.

1923 సంవత్సరపు లెక్కలనుబట్టి, రోజుకూలి సగటున 0-3-0 అయి యుండెను. కఱవు సంభవించే ప్రాంతములలో బొంబాయి ప్రభుత్వమువారు కఱవు భత్యముక్రింద ప్రతిరోజు మనిషికి 0-3-0 లు యిచ్చెడివారు. నిజము విచారించినచో యింకా యెక్కువలో ఉండును. అయినను సాధ్యమైనంతవరకు మొత్తమును తగ్గించివైచిన యెడల మన లెఖ్ఖలలో అతిశయోక్తికి అవకాశముండదు. మొత్తముమీద లెఖ్ఖవేసినచో దామాషామీద పనిచేసే వారికి సంవత్సరముకు 90 రోజులు అనగా మూడుమాసములు పని లేదని చెప్పవచ్చును. నిజముగా పని లేనిదినములు యింకా యెక్కువ యుండునని యే చెప్పవలసియున్నది. కాని అతిశయోక్తిని నివారించుటకు పని లేనిదినములు మూలునకు తొంబదియని నిర్ణయింప

బడినది. దినమునకు మనిషి ఒకటింటికి 0-3-0 ల చొప్పున 10 కోట్ల 70 లక్షల మందికి 90 రోజులకు లెక్క చేసినచో రు 1, 805, 625, 000 అగును. కావున మనదేశములో నిరుద్యోగమువల్ల సాలీనా, పై మొత్తమునకు సరిపోయినసష్టము వచ్చుచున్నదని చెప్పకతప్పదు. దీనిని జనాభామీద పంచి పెట్టినచో నగటునకు మనిషికి 5-7-0 నష్టము చొప్పున తేలు చున్నది. వీరందరు రాట్నములమీద నూలువడికి రోజుకు ఒక అణా సంపాదించినను మొత్తముమీద రు 601,875,000 ఆదాయము వచ్చును. ఈవిధముగా నిరుద్యోగసమస్యవల్ల దేశమునకు విపరీతమైన నష్టమువచ్చుచున్నది. ఈ నిరుద్యోగమునకు ప్రధానకారణము, విదేశపరిపాలనమే. ఈ విదేశపాలనమువల్ల మన గ్రామసీమలలోని వృత్తులన్నియు నశించి, వ్యవసాయము తప్ప, వేఱుగతిలేకపోయినది. దీనికితోడుగా భూమివిధానము, భూమిశిస్తువిధానము, కరెన్సీవిధానము, జనాభాపెరుగుదల, పెట్టుబడిదారీ విధానము, మొదలైనవికూడా యీ సమస్యను మఱింత క్లిష్టపఱచినవి. ఈస్థితిగతులను చక్కజేసి, బహుమంది నిఱుపేదలకు నిరుద్యోగులకు పనికల్పించుటకే, చరఖా మహోద్యమమును గాంధీమహాత్ముడు తలపెట్టెను.

నిరుద్యోగసమస్యను పారదోలుటలో బట్టల యంత్రశాలలకంటె, ఖాదీ ఉద్యమమే మిక్కిలి సమర్థమైనదని చెప్పవచ్చును. మన దేశములో నూలు యంత్రములుగాని, నేత యంత్రములుగాని షుమారు 500 ఉన్నవి. వీనిలో పనిచేయువారి సంఖ్య 1940 సంవత్సరపు లెక్కలనుబట్టి 430, 165 అని తేలుచున్నది. గాంధీమహాత్ముడు నిర్ణయించిన అఖిలభారత

చరఖాసంఘమునందు పనిచేయువారి సంఖ్య 269,445 అని తెలియుచున్నది. ఈ సంఘమునందు పనిచేయువారు గాక యింకను చేరనివారు చేనేత పారిశ్రామికులు మొదలగువారు అనేక లక్షలకు పైగా యున్నారు. మన దేశములో కోట్లాదిగా యున్న నిరుద్యోగులకు పనికల్పించుట సాధ్యమైన విషయము కాదు. పెద్ద యంత్రాగారముల నెలకొల్పినను యిన్నికోట్ల మందికి పని కల్పించుట దుస్సాధ్యము. కావున ఈ సమస్యను పరిష్కరించుటకు ఖాదీ ఉద్యమమే ఉత్తమమైన మార్గ మని నిశ్శంకముగా చెప్పవచ్చును.

# ఆరవ అధ్యాయము

## ఖాదీ ఉద్యమము — వస్త్రోత్పత్తి

భారీయంత్రములు విశేషముగా నెలకొల్పకయే మన దేశములోని నలుబదికోట్ల ప్రజలకు వస్త్రములను సరఫరా చేయుటకు వీలగునా? ఇంతమందికి ఖాదీ ఉద్యమము ఎట్లు వస్త్రమును యివ్వగలదు? వారినగ్నత్వమును ఎట్లు కప్పగలదు? అను ప్రశ్నను చాలమంది చదువుకొన్నవారే అడుగుచున్నారు. ఒక పెద్ద ప్రభుత్వోద్యోగియే నన్ను ప్రశ్నించియున్నాడు. మన దేశప్రజలకు, ఎంతవస్త్రము కావలయును? మనిషికి ఎంతెంత కావలయును? ఇతర దేశములతో పోల్చి చూచుకొందము. అమెరికా దేశములో మనిషికి సగటున 64 గజము లున్ను, జర్మనీ దేశములో 34 గజములున్ను, కనడా దేశములో

37 గజములున్న, జపాను దేశములో 21 గజములున్న., ఈజిప్టుదేశములో 19 గజములున్నూ మనదేశములో 16 గజములున్నూ ప్రస్తుతము వస్త్రము లభించుచున్నది. ఇతర దేశములలోవలె మనకు వస్త్రము సమృద్ధిగా లేదు. మనదేశములోని గొప్ప వర్తకశిఖామణులైన 'టాటా' 'బిర్లా' మొదలగు వారు తయారుచేసిన "బొంబాయి ప్రణాళిక"నుబట్టి మనిషికి సగటున 30 గజములైనను ఉండవలెనని చెప్పిరి. మనిషికి 30 గజముల చొప్పున 40 కోట్ల మందికి ఖాదీఉద్యమము వస్త్రమును సప్లయిచేయగలదా అనే ప్రశ్నను విచారింప వలసియున్నది.

మనిషికి సగటున 30 గజములుగుడ్డ చొప్పున కావలెనన్న యెడల మనదేశములోని 40 కోట్ల ప్రజలకు 40 × 30 = 1200 కోట్ల గజములగుడ్డ కావలసియున్నది. నలుబదికోట్ల జనాభాలో, వృద్ధులు, అసమర్థులు, పసిపిల్లలు మొదలగు వారిక్రింద పదికోట్లమందిని మినహాయించినప్పటికిన్నీ 30 కోట్ల మంది తేలికగా నూలును వడకగలరు. నూలువడకుట దుస్సాధ్యమైన పనిగాదు. తేలికగా ఒకవారము రోజులలో ఎవరైన నేర్చుకొనవచ్చును. ప్రతి మనిషియు సగటున రెండు గంటలు నూలువడకు ననుకొందము. సామాన్యముగా గంటకు 300 గజములదారమును తీయవచ్చును. రెండుగంటలు వడికితే 600 గజములు లభించును. రోజుకు రెండుగంటల చొప్పున 360 రోజులు నూలు వడికినయెడల 360 × 6000 = 216000 గజముల దారమును ప్రతిమనిషియు సంవత్సరమునకు తీయగలడు. సగటున ఒకగజముగుడ్డ తయారు చేయవలెనంటే

5000 గజముల దారముకావలెను. ఒకమనిషి రోజుకు రెండు గంటలు చొప్పున తీసెడునట్టి 216000 గజముల దారమునకు 216000 ÷ 5000 = 43 గజములబట్ట వచ్చును. అసమర్థులైన వారిక్రింద 10 కోట్ల మందిని మనజనాభాలో నుంచి మినహా యించవలసి యుండుననే అంచనామీద నూలుతీయగలవారు 30 కోట్లమంది ఉండగలరు. 30 × 43 = 1290 కోట్ల గజముల గుడ్డ సంవత్సరమునకు తేలికగా తయారుకాగలదు. మనిషికి సాలునకు 30 గజముల చొప్పున వచ్చిన లెఖకంటె యింకా ఎక్కువగుడ్డయే లభించును.

ఒక్కొక్కచేనేత మగ్గముమీద ఒకగంటకు షుమారు ఒకగజముగుడ్డ నేయవచ్చును. రోజుకు ఆరుగంటలు పని చేసినచో ఒకమగ్గముమీద రోజుకు 6 గజములగుడ్డ తయారు చేయవచ్చును. ఆరేటుప్రకారము ఒక సంవత్సరమునకు 360 × 6 = 2160 గజములగుడ్డ ఒకమగ్గముమీద తయా రగును. నలుబదికోట్ల మందికి కావలసిన 1200 కోట్ల గజముల గుడ్డ తయారుకావలెనంటే పై లెఖ్కప్రకారము షుమారు 55 లక్షల మగ్గములు కావలయును. బీరారు, సంయుక్త పరగ ణాలు, మధ్యపరగణాలు, మినహాయించి 1921 సంవత్సరములో తేల్చిన లెఖలబట్టి షుమారు 20 లక్షల మగ్గములు మనదేశ ములో నున్నట్లు తెలియుచున్నది. మొత్తము అన్నియు కలసి 30 లక్షల మగ్గములు ఉండవచ్చును. ఇంకా 25 లక్షల మగ్గ ములు తయారుచేసినయెడల యంత్రములతో నిమిత్తము లేకుండానే, సమస్తభారతీయులకు ఖాదీఉద్యమమువల్లనే వస్త్ర సమృద్ధి చేకూరగలదు.

# ఏడవ అధ్యాయము

## వికేంద్రీకరణము

పాశ్చాత్యదేశములయందు, యీయుగము యంత్రయుగమని చెప్పబడుచున్నది. ఉత్పత్తి విశేషముగా పెద్దపెద్ద యంత్రములవలననే జరుగుచున్నది. పెద్ద యంత్రములు గొప్ప ధనికులవశమందైనను, లేక ప్రభుత్వవశమందైనను ఉండియున్నవి. ఉత్పత్తి యనునది యంత్రములద్వారా ఒకేస్థలమందు జరుగుచున్నది. దూదియంత్రమున్నచోట, దేశ దేశములలో పండిన దూదియంతయు యంత్రమున్న స్థలమునకు చేర్చబడి, ఆ యంత్రములలో వస్త్రముగా తయారై భిన్న ప్రదేశములందున్న వినియోగీకులకు చేరుచున్నది. ఈ పద్ధతినే కేంద్రీకరణమందురు. ఉత్పత్తిసాధనములు, ఉత్పత్తిచేయు పారిశ్రామికులు, ముడిపదార్థములు, అన్నియు ఒకచో కేంద్రీకరించబడి, వస్తూత్పత్తి జరుగుచున్నందున, యీపద్ధతినే కేంద్రీకరణపద్ధతి అని యందురు. అట్లుగాక, ముడిపదార్థములు లభించెడు స్థలములయందే, పారిశ్రామికులు ఉండి, చిన్నచిన్న సాధనములద్వారా, ఆ ముడిపదార్థములను, ఉపయోగించి, వస్తువులను తయారుచేసే పద్ధతికి వికేంద్రీకరణము అని అందురు. ప్రత్తి లభించిన స్థలమునందే, దానిని శుభ్రముచేసి, గింజలుతీసి, ఏకి, ఏకులు తయారుచేసి, రాట్నములమీద నూలుతీసి ఆ నూలును మగ్గములద్వారా వస్త్రములుగా తయారుచేసి, ప్రజలకు సప్లయిచేసే పద్ధతిని, వికేంద్రీకరణపద్ధతి

యని అందురు. అటులనే యితరవస్తువుల విషయములలోకూడ యీపద్ధతిని వర్తింపజేసుకొనవలయును. ఉత్పత్తి, వినియోగము, రెంటియందును యీ పద్ధతిని అవలంబింపవచ్చును. కేంద్రీకరణపద్ధతియందు, ముడిపదార్థములు ఉన్నచోటనే ఉత్పత్తిసాధనములైన యంత్రములు ఉండవలసిన యవసరము లేదు. ముడిపదార్థములన్నియు, యంత్రమున్న దేశమునకు గొంపోబడును. ఆ యంత్రమునందు వేలకువేలు ప్రజలు కలసి పనిచేయుచుందురు. ముడిపదార్థమును బాగుచేసి, వస్తురూపముగా తయారుచేయుటకు ఆ యంత్రముతే ఉపయోగింపబడును. అక్కడ తయారైన వస్తువులు, భిన్నప్రదేశముల యందున్నట్టి వినియోగదారులకు సరఫరాచేయబడును. ఇది కేంద్రీకరణ పద్ధతిలో జరిగే విషయము.

మిగిలిన వస్తువుల విషయములో నెటులున్నను వస్త్రము విషయములో, వికేంద్రీకరణపద్ధతియే మన దేశమునకు మంచిదని చెప్పవలయును. మన దేశము గ్రామీణదేశము. ప్రజలు నూటికి 90 వంతులు గ్రామములలోనే నివసించుచున్నారు. వారికి అనుస్యూతముగా, అనాదికాలమునుంచియు నూలుతీయుట, అలవాటైయున్నది. గ్రామములో లక్షలకుపైగా, చేనేత పారిశ్రామికులు గలరు. వారున్నూ అనూచానముగా, వారివృత్తియందు కౌశలమును సంపాదించియున్నారు. వీరందరికి, ఉన్నవారిని ఉన్నట్లుగా, పనికల్పించి, వారికి జీవనోపాధి కల్పించుట మేలు. లేకున్న కేంద్రీకరణపద్ధతిని అవలంబించినచో, వారి వృత్తులు నశించును. వారి జీవనములు అంతరించును. గ్రామములు నశించి పట్టణములు వృద్ధినందును. వారు యిప్పు

వాకిళ్ళు వదలివేసి పట్టణములకు పయనము కావలసివచ్చును. అక్కడ జీవనములేక అల్లాడవలసివచ్చును. ఎన్ని ఏర్పాటులు చేసినను, గ్రామములయందలి ఆరోగ్యపరిస్థితులు, పట్టణములయందు ఉండనేరవు. కావున వా రనారోగ్యవంతులగుదురు. యంత్రశాలలలో పనిచేయువారి నైతికవర్తనమునకు, కొంత కలుగవచ్చును. కావున ఉన్నదానిని చెడగొట్టి అనవసరముగా క్రొత్తదానిని నిర్మించుట వివేకయుతమైన కార్యము కాజాలదు.

వస్త్ర సమృద్ధికి సంబంధించి నంతవఱకు కేంద్రీకరణము కంటె, వికేంద్రీకరణమునందే గుణములున్నవని చెప్పుటకు యీ క్రింది హేతువులు కలవు.

I ఖర్చులలో రాయితీ II ఆపత్తులనుండి తప్పించుకొను అవకాశములు III యితరములైన ఆర్థిక, సాంఘిక లాభములు.

(1) ఖర్చులలో కేంద్రీకరణమునందుకంటె, వికేంద్రీకరణమునందు రాయితీ ఎట్లువచ్చునో గమనించవలసియున్నది.

(1) ముడిపదార్థములను ఒకచోటికి చేర్చుటకు అగు ఖర్చులు (2) ముడిపదార్థములను ఒకచో నిల్వయుంచుటకు అగు ఖర్చులు. (3) వీటిని ఒకప్రదేశమునుండి మరొక ప్రదేశమునకు రవానా చేయుటకు రైలు, మోటారు, పడవ, మొదలగు వాటికగు ఖర్చులు (4) వస్తువులను దూరదేశములకు పంపుటకు వీలుగానుండునట్లు చేయుటకు ప్యాకింగు మొదలగు ఖర్చులు. (5) మరలయొక్క వేడివలన, వడివలన పాడైక్రింద పోయే పదార్థములకు ఖర్చులు, (6) అగ్నివలన ప్రమాదము

లేకుండా భీమాఖర్చులు (7) దూరప్రయాణములో చెడిపోయే వస్తువులయొక్క ఖర్చులు, (8) తయారైనవస్తువులను నిల్వ యుంచుటకు అగు ఖర్చులు (9) ప్రకటన (Advertisements) ఖర్చులు, (10) వినియోగదారుల అభిరుచి మారిపోయిన మొదల వినియోగము కాక మిగిలిపోయిన వస్తువుల క్రింద అయిన ఖర్చులు (11) వర్తకుల కమీషను మొదలగు ఖర్చులు (12) యంత్రములు నడుపుటలో అవసరమైన ఉద్యోగుల పెద్దజీతముల క్రింద ఖర్చులు (13) బొగ్గు, చమురు, మొదలగు వానిఖర్చులు (14) కోర్టు ఖర్చులు (15) బ్యాంకువడ్డీ ఖర్చులు (16) ఆదాయపుపన్ను ఖర్చులు (17) ఇతర మ్యునిసిపలు ఖర్చులు (18) యంత్రములు, కట్టడములకు మరమ్మతు ఖర్చులు (19) యంత్రములు, కట్టడములకు భీమా ఖర్చులు (20) పారిశ్రామికులకు నష్టపరిహారముల క్రింద యిచ్చే ఖర్చులు (21) డిక్రీ పిటీషను ఖర్చులు. ఈ ఖర్చులు అన్నియూ కేంద్రీకరణమునందు తప్పక భరించవలసి యున్నవి.

II ఆపత్తులనుండి తప్పించుకొనే అవకాశములు.

(1) అగ్నిభయము (2) చోరభయము (3) సమ్మెల భయము (4) భూమండుల భయము (5) రవానాలో వచ్చే యిబ్బందులవల్ల భయము (6) వినియోగదారులకు అవసరమైన వస్తువులయొక్క ఉత్పత్తి కలుగకనే భయము.

III ఇతరములైన ఆర్థిక, సాంఘిక లాభములు.

(1) విదేశవ్యాపారస్థులకు, విదేశీయ పెట్టుబడిదారులకు బానిసత్వము లేకుండుట (2) తయారైన వస్తువులు సుందరము గాను, చాలాకాలము మనునట్టివిగాను అభిరుచులకు అనుకూలము

లైనవిగాను ఉండుట. (3) పట్టణములయందలి అనారోగ్యకరములైన ప్రదేశములయందు నివాసములు కల్పించుకొన అవసరము లేకుండుట (4) నైతిక జీవితమునకు భంగము వాటిల్లెడు పరిస్థితులు లేకుండుట (5) రైల్వేలు పట్టణవసతి సౌకర్యములకు వ్యయించబడే ఖర్చులు తగ్గుట (6) ధనవంతుల రొక్క నిరంకుశత్వము తగ్గుట (7) ధనవంతుల ప్రాబల్యము వలన కలిగే కరెన్సీ విధానమునందు సంభవించెడు దోషములు లేకుండుట (8) ఆనందకరమైన విశ్రాంతి దొరకుట (9) దురాశ, దుర్నీతి, లోభము, మొదలగు దుష్టగుణములకు తావివ్వక ఆత్మాభివృద్ధికి మార్గదర్శకమగుట.

ఈ లాభములన్నియు, వికేంద్రీకరణ పద్ధతివలననే లభించును. వికేంద్రీకరణమునకు పెద్దపెద్ద వస్త్రయంత్రములు కేవలము అననుకూలములు. దీనికి రాట్నము చేమగ్గము అనే ఖాదీఉద్యమమే తగియుండును.

కేంద్రీకరణపద్ధతి ప్రకారము; పెద్దయంత్రములవల్ల వస్త్రములు చౌకగా కొనువారికి గిట్టుబాటు అగుననియు, వికేంద్రీకరణ పద్ధతిమీద నడిచే ఖాదీఉద్యమము ప్రకారము తయారయ్యే వస్త్రము కొనువారికి గిరాకీగా నుండుననియు చెప్పుచున్నారు.

కేవలము డబ్బుమూలముగా ఆలోచించినయెడల యిది నిజమే. మిల్లుబట్ట యంతచౌకగా ఖద్దరు లభించనేరదు. కనుక ప్రస్తుతము ధనమనే పునాదులమీద సంఘము నిర్మింపబడి యున్నందున మిల్లుబట్టతో ఖద్దరు పోటీకి నిలువజాలదు అనే వాదనలో కొంతబలము లేకపోలేదు.

సంఘము మొత్తముమీద, లాభనష్టముల నాలోచించుట శాస్త్రీయమార్గముగాని, వస్త్రమును డబ్బుపెట్టి కొనువారలను దృష్టిలో నుంచుకొని మాత్రమే యీ విషయమును విచారించుట న్యాయమైనపని కాదు. కొనువారికి కొంచెము గిరాకీ అయినను, తాము స్వలాభ మపేక్షించక, పని లేక నిఱుపేదలై జీర్ణించుచున్నవారి దుస్థితిని బాపుటకై అదనముగా ఎక్కువ డబ్బు పెట్టుచుంటిమనే ఉన్నతభావమును కలిగియున్నచో, అది సరియైన సాంఘిక, నైతికదృష్టియగును. ఆదృష్టితో చూచినయెడల, మిల్లుబట్టకంటె, ఖద్దరు ఎక్కువ ధర కలిగియున్నను అది న్యాయమే యగును.

మొత్తము సంఘమునకు ఆరోగ్యవిషయములోను, నైతిక జీవితములోను, ఆనందప్రాప్తి విషయములోను ఏబట్టను అభిమానించుట మంచిదో విచారించినయెడల, మిల్లుబట్ట కంటె, ఖద్దరునకే ప్రాధాన్య మియ్యవలయును. జీవించుటకు ధనము అవసరమే. ప్రతివాడును, తక్కువధరకు వస్తువులు కొనవలె నను సహజమైన కోర్కె కలిగియుండును. లౌకిక వ్యవహారములయందు ధనము ముఖ్యమైనమాట నిజము. కాని ధనమే సర్వము అని భావించుటయు, ధనమునుబట్టియే సర్వ విషయముల పరిశీలించుటయు, సాంఘికముగా సంకుచిత దృష్టియగును.

అదియునుగాక, గాంధీసిద్ధాంతము ప్రకారము ఖద్దరు కేవలము, ధనము పెట్టి కొనేవస్తువు కాదు. జాతికి తీరిక లేని ఏ కొలదిమందియో తప్ప, తీరికకలవారు తమ కాలమును, దుర్విషయములందు వ్యర్థపుచ్చక, సంఘశ్రేయస్సుకొఱకై,

దారమును తీసినచో, వారికి దారముఖరీదు కలసివచ్చును గనుక, ఖద్దరు వస్త్రములు అనుకొన్నంత గిరాకీగా కనబడవు. వస్త్రములు విశేషముగానున్ను ఉత్పత్తియున్ను అగును.

ఖాదీఉద్యమము ప్రస్తుతము బాల్యదశలోనున్నది. క్రమేణ వృద్ధియగుచున్నది. ప్రజలు దానిని శ్రద్ధతో అవలంబించినకొలది అందులోని సుళువు బరువులు తెలియగలవు. సన్ననిదారమున్ను, వడిగా గంటకు ఎక్కువదారమున్నూ తీయగలరు. కావున కొంతకాలము గడచినతర్వాత, విశేషాభ్యాసమువలన అదేకాలమునందు ఎక్కువ ఉత్పత్తిని వడకుటలోగాని, నేయుటలోగాని చేయుగలుగుదురు. దానివలన ఖద్దరు మిల్లుబట్టయంత గాకున్నను, ఇప్పటికంటె చౌకగా లభించగలదు.

బట్ట గిరాకీయా, చౌకయా అని ఆలోచించునప్పుడు దానిని కొనుటకు అయ్యే డబ్బునుబట్టి మాత్రమే నిర్ణయించ రాదు. ఒకగజము ఒకరూపాయికి కొన్న మిల్లుబట్ట ఆరు మాసములు మాత్రమే మనగలిగి ఒకగజము రెండు రూపాయిలచొప్పున కొన్న ఖద్దరు ఒక సంవత్సరము మనగలిగినచో ఖరీదులో తేడా తాత్కాలికముగా, కనబడినను యథార్థముగా తేడా లేదనియే చెప్పవచ్చును. కావున మిల్లుబట్ట ఖద్దరుకంటె చౌకయైనను మొత్తముమీద ఖద్దరువలననే సంఘమునకు ఎక్కువలాభము కలదు.

ముగా అందరూ అంగీకరించిన విషయముగా తోచును. రాట్నముమీద నూలుతీసినందున రోజుకు ఒక అణా మాత్రమే వచ్చుచున్నదనియు, మగ్గముమీద నేతనేయుట వల్ల రోజుకు యెనిమిది అణాలు వచ్చుచున్నదనియు చెప్పుచున్నారు. కాబట్టి రోజుకు రెండుగంటలు నూలు వడికేవానికి ఒకకాని లేక మూడు దమ్మిడీలు మాత్రము వచ్చుచున్నదనియు, ఆర్థికముగా ఎవరికిని అది ఆకర్ష ణము గాదనియు చెప్పుచున్నారు. ............

.........ఇప్పుడు నూలువడకుటలోని సందర్భములు ...చెదము. ఒకానొకప్పుడు అది యావద్భారతము సర్వసామాన్యమైన ఉపవృత్తిగా నుండి యుండె ...ము. కోట్లకొలది ప్రజలు యింకా యీకళను ... లక్షలమంది యిండ్లలో యింకా రాట్న ...యున్నవి. కాబట్టి రాట్నపరిశ్రమను వెంటనే వృద్ధిచేయుటకు అవకాశములున్నవి. ఒక ... నూలు సప్లయిచేయుటకు పదిమంది ...వలయును అని తెలిసికొన్నాము గనుక, చేనేత పారిశ్రామికులకు, 9 కోట్లమంది ...నూలుసప్లయిచేసి, తమ ఆదాయము ...గను పెంపుదల చేసుకోగలరు. ...మైన విషయమే. నరకు ...ప్పరమునకు రు 40-0-0 ... నేతపనివలెగాక, ... అప్పుడు మాని

వేయవచ్చును. తిరిగి ప్రారంభించవచ్చును. దానికి ఒక నియమిత కాలము అక్కరలేదు. నూలుతీయుటను త్వరలోను, వడిగాను నేర్చుకొనవచ్చును. ఆరంభించిన మొదటి దినమునుంచి ఏదో దారమును తీయ మొదలు పెట్టవచ్చును... తృప్తికరమైన గ్రామ జీవితమును నిర్మించుటకు రాట్నమే పునాదియని యిందువలన తెలియుచున్నది. ఇదియే కీలకము... ... ...

ఎంత నిఱుపేదరైన గ్రామీణులనైనను రెండుగంటలకు మూడుదమ్మిడీలు ఆదాయమువచ్చుట ఎంతమాత్రము ఆకర్షణీయముగాదని చెప్పుచున్నారు. ఇంతకంటె లాభకరమైన వృత్తిగలవారికి రాట్నము ఉద్దేశింపబడలేదు.

... ... ... ... ... ... ... ... ... ...

మన దేశములో నిత్యము పెఱుగుచున్న దారిద్ర్యమునకు వెంటనే తరణోపాయము కావలెను. ఆ ఉపాయము రాట్నమువలననే సిద్ధించును. ... ... ... ... ... ... ... ... ఎక్కడ కోరినను అనేకవిధములుగా గ్రామీణుల జీవితము ను అది అభివృద్ధి చేయుచున్నది.

నూలువడకుటను గురించి నీవు చెప్పినది సరియైనదే అగుచో ఇప్పటికి దానిని ప్రజలందరు ఎందుకు అవలంబించలేదు అని పూర్వపక్షము వచ్చుచున్నది. పూర్వపక్షము సరియైనదే. సమాధానమున్ను సులభమే. ప్రజలలో ఉత్సాహముగాని కార్యారంభకత్వముగాని లేదు. వారికి తగు నలహా నిచ్చుకొనుచో, పనిచేసి జీవించుటకంటె ఉపవసించి మరణించెదరు. అట్టివారికి ఈ రాట్నసందేశ

మును తీసుకొనిపోవలెను. పూర్వమట్లు ఉండెడిదికాదు. చిరకాల విస్మరణమువలన అలసత్వము వారికి అలవాటు అయిపోయినది. సత్పురుషులు మార్గదర్శకులై వారితో సంబంధము కలిగించుకొని, వారిమధ్య రాట్నమును త్రిప్పిన యెడల వారి సోమరితనము అంతరించగలదు. ఖద్దరు అమ్ముటకు తగిన విపణివీధి లేకుండుట రెండవచిక్కు. ప్రస్తుతములో మిల్లుబట్టలతో ఖద్దరు పోటీ చేయలేదని నేను అంగీకరించెదను. ఇంకొకదానిని నాశనముచేసే పోటీ పద్ధతులతో నేను సంబంధము కలిగించుకొనజాలను. విపణి వీథిని తన వశముచేసుకోదలచిన పెట్టుబడిదారుడు తన వస్త్రమును నామమాత్రమైన ఖరీదునకు అమ్మవచ్చును. పరిశ్రమనే తన ధనముగాగల శ్రామికుడు అట్లు చేయ జాలడు. ఖద్దరు సజీవమైనవస్తువు. భారతదేశమునకు యథార్థ మైన కళయందు అభిరుచి నశించిపోయినది. పైమెరుగులు చూచి సంతోషపడుచున్నది. ఖద్దరునందు జాతీయమైన అభిరుచిని కలుగజేయండి. అప్పుడు ప్రతిగ్రామము ఝుంక రించుచున్న తేనెపట్టువలెనుండగలదు. ఇప్పుడున్న స్థితిలో ఖద్దరునకు విపణివీథి సంపాదించుటకై ఖద్దరు సంస్థపై విశేషభారము పడియున్నది. ఎన్నికష్టముల నెదుర్కొన వలసివచ్చినను యీ ఉద్యమము అభివృద్ధి జెందుచుండుట గొప్ప విశేషము..................................

చేమగ్గముకంటెకూడా ఉపవృత్తిగాను చేయుటకు రాట్నమే మేలని నిస్సందేహముగా ఇంతవరకు తెలిపియుంటిని. ఇందును గూర్చి వికల్పములుండరాదు. చేమగ్గమునకు నేను వ్యతి

లేకినిగాదు. అది గొప్పదై అభివృద్ధిజెందవలసిన పరిశ్రమ అయియున్నది. రాట్నపు ఉద్యమము అభివృద్ధినొందినచో, దానితోటే అదియే క్షేమగ్గమున్ను వృద్ధి నందగలదు, రాట్నము నశించినచో అదియును నశించగలదు."

రాట్నమునుగూర్చి పరిశోధనలు సలిపి యంత్రములో నవీనములైన మార్పులు సంపాదించి, తక్కువ కాలములో, ఎక్కువ దారమును తీయుటకు కావలసిన ఏర్పాటులు జరుగవచ్చును. ఆసందర్భములో, నూలుతీయుటవలన యిప్పటికంటె ఎక్కువ ఆదాయమును సంపాదింపవచ్చును. నూలు తీయువారి ఆదాయము ఇంకను పెరుగవచ్చును.

ఖద్దరుఉద్యమము నవీనశాస్త్రపరిశోధకులకు విరోధి. ఇది కేవలము అటవికనాగరికతకు సంబంధించినది అని కొందరు ఆక్షేపించుచున్నారు. పెద్దపెద్దయంత్రములుంటేనే నవీనశాస్త్రకౌశలము ఉన్నదనియు, చిన్నచిన్న యంత్రములుంటే అట్టిది లేదనియు అనుకొనుట పొరపాటు. ఒక పెద్ద విమానమునో, నౌకనో గూర్చి శాస్త్రపరిశోధన యెంత కష్టమో, ఒక అణువును గూర్చి పరిశోధన చేయుటయు, అంత కష్టసాధ్యమున్ను, శాస్త్రీయమున్నూ అగును. రైల్వేఇంజను చేయువాని శాస్త్రజ్ఞానముకంటె, ఒక చిన్న గడియారముచేయువాని శాస్త్రజ్ఞానము తక్కువ కాదు. సూర్యతేజస్సు అంతర్గర్భితమైయున్న బొగ్గును ఉపయోగించుట ఎంతశాస్త్రీయమో, సూర్యతేజమువలన లభించిన ఆహారమును భుజించే మనుష్యులయొక్క శక్తిని వినియోగించుటయు అంతశాస్త్రీయమే. ప్రకృతిశక్తిని విద్యు

రోగించుకొనుటయే ధాతికశాస్త్రముయొక్క పని. ఆశక్తి ఏరూపముననైనను ఉండవచ్చును. దేశకాలపరిస్థితులబట్టి ఆ శక్తిని వినియోగించుట సరియైన శాస్త్రీయపద్ధతి అగును. శాస్త్రీయమార్గముల నాలోచించి రాట్నయంత్రమును అనేకవిధములుగా వృద్ధిచేయవచ్చును. అటులనే చేమగ్గమునుకూడ వృద్ధిచేయవచ్చును. అట్టిపనిముట్లవలన ప్రకృతి శక్తిని అనగా ఆహారమువలన మనుష్యునికి కలిగేశక్తిని ఎక్కువగా ఉత్పత్తిసాధనము చేయవచ్చును.

# తొమ్మిదవ అధ్యాయము

## ఖా దీ పూ ర్వ చ రి త్ర

రాట్నము, ఖద్దరు నిర్మాణము అనునవి మనదేశములో బహుప్రాచీనకాలమునుండియు ఉన్నవి. పాశ్చాత్యదేశములోని మనుష్యులు అనాగరికులై పశుప్రాయులుగా ఉన్న కాలమున మనదేశీయులు గొప్పనాగరికతను గొప్ప సభ్యతను నిర్మాణము చేయగలిగిరి. పాశ్చాత్యదేశములలో వస్త్రమును నిర్మించుకొని తమ నగ్నత్వము కాపుకోవజాలని అజ్ఞానస్థితిలో పాశ్చాత్యులు ఉన్నప్పుడు మనదేశీయులు దివ్యసుందర వస్త్రములను తయారుచేసికొన గలిగిరి. వేదములయందు, అందులో ఋగ్వేదమునందు రాట్నమునంగతి కలదని ఒక పండితుడు చెప్పినట్లు గాంధీమహాత్ముడు యంగు ఇండియా పత్రికయందు పూర్వము వ్రాసియున్నాడు. ఋగ్వేదము పదవ

మండలములో నున్న శ్లోకమునకు ఆంగ్లానువాద మివ్వబడినది. దానికి తెలుగున తర్జుమాచేసినయెడల ఈ క్రిందివిధముగా నున్నది.

"దారమును వడికి, దానికి తళతళలాడెడు రంగు నమర్చి ముడిలేకుండా వస్త్రమును నేయుము.................."
ఋగ్వేదమునందు పదవ మండలములోనే వేఱొకచోట యీ క్రిందివిధముగా నున్నది.

ఇదియును ఆంగ్లమునుండి తర్జుమా చేసియున్నాను.

"యజ్ఞశాలవద్ద పండలకొలది శాస్త్రజ్ఞులు పనిచేయు చున్నారు. ఆశాల, కోట్లకొలదిగాగల నూలుదారముల చేత పరివేష్టింపబడియున్నది. ఇక్కడ పెద్దలున్నారు. ఇక్కడ వస్త్రమును నేయుము. ఈకర్మచేయుము అంటూ వారు పర్యవేక్షణ చేయుచున్నారు."

దీనినిబట్టి బహుళశాబ్దములకు పూర్వమునుండియే మన దేశములో సర్వే సర్వత్ర అన్నిజాతులవారు, పండితులు, పామరులు, స్త్రీలు, పురుషులుకూడా నూలుతీయుట, బట్టలు నేయుట అనే ఖద్దరువిద్యను ఎఱిగియుండుటయేగాక, అభిమాన విద్యగా పరిగణించినట్లు తెలియుచున్నది.

ఈజిప్టుదేశములో గోరీలున్నవి. అవి అనాదిసిద్ధములైనవి. క్రీస్తుపూర్వము 2000 సంవత్సరములనుంచి ఉన్నవని చరిత్ర కారులు తెలుపుచున్నారు. వానిలో చక్కని, పలుచని, సుందరమైన భారతదేశపు మస్లిను అనే వస్త్రములు కానవచ్చుచున్నవి. అనగా ఇప్పటికి 4 వేల సంవత్సరముల క్రిందటనే భారతదేశమునందు అతినాగరికమైన సన్నని విలువగల వస్త్ర

ములు నేయబడుచుండెడివి. కౌటిల్యుని అర్థశాస్త్రమునందు గూడ చరఖాని ఖాదీ విద్యనుగురించి వాక్యములు కలవు. కౌటిల్యుడు రెండువేల సంవత్సరములక్రింద ప్రఖ్యాతిగాంచిన పురుషుడు. రోమక సామ్రాజ్యకాలమందు, రోమునగరము లోని రాజస్త్రీలు, మనదేశములోని పట్టువస్త్రముల ధరించి ఆనందించెడివారు. 17 వ శతాబ్దమునందు, మనదేశమునకు యాత్రకై వచ్చిన, ఒక ఫ్రెంచియాత్రికుడు మనదేశములోని ఖాదీనైపుణ్యమునుగూర్చి యీవిధముగా వ్రాసియున్నాడు. "ఇండియాకు రాయబారిగా వచ్చిన పర్షియాదేశపు మహామాత్ర అలీబేగు అను నాతడు, నవరత్నఖచితమై, కోడిగ్రుడ్డంత పరిమాణముగల కొబ్బరికాయబుఱ్ఱయందు, చేతితో పట్టుకుంటే ఉన్నదా లేదా యను అనిపించేటంత, సన్నని 60 మూళ్ళ తల పాగా బట్టను పెట్టి, ఆదేశపు రాజున కిచ్చెను." బ్రిటిషు సామ్రాజ్యము యీదేశములో నెలకొల్పబడునంతవరకు యీ ఖాదీపరిశ్రమ అత్యున్నతస్థితిలో నుండెను. వ్యవసాయికులకు నిది ముఖ్యమైన ఉపవృత్తిగానుండెను. ఈ వృత్తిని, ఈ పరి శ్రమను, నిర్దాక్షిణ్యముగా బ్రిటిషు సామ్రాజ్యవాదులు చంపి వేసిరి.

18 వ శతాబ్దములోని ఇంగ్లాండు చరిత్ర వ్రాసిన 'లెకీ' అను చరిత్రకారుడు యీవిధముగా వ్రాసియున్నాడు. "17వ శతాబ్దము చివరిభాగమునందు భారతదేశమునుంచి, సుందర మైనఛీటియు, చౌకఅయినఛీటియు, మస్లినులు, కాలికో మొదలయిన వస్త్రములు ఇంగ్లండుదేశమునకు దిగుమతి అగు చుండెను. వానిని ఇంగ్లండు ప్రజలు మిక్కిలి అభిమానించిరి.

అందువలన ఇంగ్లాండులోని ఉన్ని, పట్టునేసెడువారు మిగుల భయభ్రాంతులైరి. 1700, 1721 సంవత్సరములయందు, వ్యయితర దేశమునుంచియైనను, ధరించుటకుగాని, అలంకరించుటకుగాని దూదితో చేయబడిన వస్త్రములను, ఇంగ్లండులో ప్రజలు ఎవ్వరు ఉపయోగించరాదని నిషేధించుచు పార్లమెంటుచే శాసనములు చేయబడెను. ఇండియా దేశపు కాలికో వస్త్రమును ఏ ఇంగ్లండు దేశస్త్రీయైనను ధరించుట నేరమగునని కూడ శాసింపబడి యుండెను"

మరొక ఆంగ్లదేశ చరిత్రకారుడు యిట్లు వ్రాసియున్నాడు. "ఇండియా దేశముతోడి వస్త్రవ్యాపారముయొక్క చరిత్ర చాల విచారకరమైనది. ఇండియా దేశము ఇంగ్లండుమీద ఆధారపడియున్నప్పుడు ఇట్టిది మిక్కిలి విచారకరము. 1813 వ సంవత్సరమువరకు, బ్రిటిషు బజారులలో, ఇండియా దేశమునుంచి వచ్చే వస్త్రములు, ఉన్నిదుస్తులు, ఇంగ్లాండులో తయారైన వాటికంటె నూటికి అరువది వంతులు చౌకగా అమ్మబడుచుండెడివి. ఇంగ్లాండు పరిశ్రమలను రక్షించుటకై ఇండియానుంచి వచ్చే వస్త్రముల ఖరీదుపై నూటికి 80 చొప్పున దిగుమతిసుంకములు విధింపబడెను. లేదా అవి నిషేధింపబడెను. అట్లు జరుగకపోయినయెడల, అటువంటి శాసనములు చేయబడకుండినయెడల, మాంచెస్టరు మిల్లులు మొదటలోనే మూలబడిపోయియుండెడివి. ఆవిరియంత్రముల సహాయముచేతనైనను అవి పనిచేయగలిగియుండెడివి కావు. ఇండియాలోని పారిశ్రామికుని చంపివేసి, యివి అభివృద్ధిలోనికి వచ్చినవి. ఇండియా స్వతంత్రదేశమే అయియుండినట్లయితే

8

మందికి నష్టము కలుగజేసి కొద్దిమందిని ధనవంతులుగా చేసే యంత్రములు మొదల నాకు విశ్వాసము లేదు" అని కూడా మహాత్ముడు చెప్పియున్నాడు.

యంగుఇండియా పత్రికలో వ్యాసము వ్రాయుచు మహాత్ముడు యీవిధముగా తెలిపియున్నాడు. "లక్షలకొలది ప్రజలు పనిలేనివారై వీధులలో అల్లాడుచు క్షుధార్తులై మరణించువరకు, పనితగ్గించి విరామము నెక్కువనొసంగు పద్ధతు లవలంబించ బడుచున్నవి. కొలదిమందికిగాక ప్రజలకు యావన్మందికి పనిని తగ్గించవలెనని నేను కోరుచున్నాను. ధనము కొద్దిమంది చేతులలోనే నిల్వయుండరాదనియు, అందరివద్ద నుండవలెననియు, నేను వాంఛించుచున్నాను. నేడు బహుమంది బీదలపై కొద్దిమంది ధనికులు స్వారిచేయుటకు మాత్రమే యంత్రములు ఉపయోగపడుచున్నవి. దీనికంతకు మూలము పని తగ్గించవలెననే దాక్షిణ్యభావముకాదు. దురాశయే ఇట్టివ్యవస్థ పనికిరాదని నేను నా శక్తికొలది పోరాడుచున్నాను."

తరువాత జి. రామచంద్రనుగారితో సంభాషణలో మహాత్ముడు యీవిధముగా తెలిపియున్నాడు.

రామచంద్రన్:—"బాపూజీ! యంత్రములతో నీకు విరోధము లేదు. కాని ప్రస్తుతము మనకు కనబడుచున్న యంత్రములవలన చెడుగులకుమాత్రము నీవు విరోధివి"

గాంధీమహాత్ముడు:—"అవును, నిశ్చయముగా అంతే. అయినను ఒకమాట చెప్పెదను. భౌతికశాస్త్ర పరిశోధన ఫలితములు దురాశాలోభములకు సాధనములుగా నుండుట సంభవించ

రాదు. అప్పుడు శ్రామికులకు మితిలేనిపని ఉండదు. యంత్రములు వారికి విరోధములగుటకు బదులు సహాయకారులు కాగలవు. యంత్రముల నాశనముచేయుట నా ఉద్దేశ్యముకాదు. వాటిని అదుపులో నుంచుటయే"

రామచంద్రన్:—"హేతువాదప్రకారము, ఆవిరి, విద్యుచ్ఛక్తి, మొదలగు శక్తిచే నడుపబడెడు పెద్ద యంత్రములు అక్కరలేదని మీభావముల తాత్పర్యము."

గాంధీమహాత్ముడు:—"అటులే కావచ్చును. కాని నేను ఒక సంగతి స్పష్టముగా చెప్పవలెను. ఈ విషయములలో ముఖ్యముగా చూడవలసినది మానవుడు. యంత్రము, మానవుని అవయవములను చచ్చుపడజేయరాదు. ఇందుకు కొన్ని అపవాదములు (exceptions) ఉండవచ్చును. ఉదాహరణము—కుట్టువని యంత్రము."

రామచంద్రన్:—"అట్లయితే, కుట్టువని యంత్రమును తయారుచేయుటకు, పెద్ద యంత్రాగారము కావలసివచ్చునుగదా."

గాంధీమహాత్ముడు:—"అవును. అట్టి యంత్రశాలలు ప్రభుత్వపరము కావలెననేటంతవరకైనను నేను సాంఘిక వాదిని. అట్టివి ఆకర్షణీయములైనట్టియు, ఆదర్శప్రాయములైనట్టియు పరిస్థితులలో పనిచేయవలయును. వ్యక్తుల లాభముకొరకు కాకుండా, ప్రజానీకముయొక్క లాభమునకే పనిచేయవలయును. ఆశయొక్క స్థానమును ప్రేమ ఆక్రమించవలెను. నేను కోరేది శ్రామికులయొక్క స్థితిగతులలో మార్పు. ధనము కూడబెట్టవలెననే పిచ్చిగంతులు పోవలెను. శ్రామికునకు, నిత్యజీవనమునకు చాలినంత కూలి లభించుటయే

గాక, అతనిపని ఎల్లప్పుడున్నూ, ఉత్సాహజనకముగా నుండవలెను గాని, విసుగుజెందించునది కానరాదు. ఈ విషయములో మొదటగా ఆలోచించవలసినది మానవునిగురించియే. మానవునికి పనితగ్గించుట ఆశయము. న్యాయమైన సౌహార్ద్ర భావముగాని, దురాశ ఎన్నటికిన్ని ప్రోద్బలముగా నుండరాదు. కావున వంకరపోయిన కదుళ్ళను బాగుచేసే యంత్రమువంటి యంత్రమును దేనినైనను నేను ఆహ్వానించెదను."

రామచంద్రన్:—"నీ కదుళ్ళకు, కుట్టుపని యంత్రములకు అపవాదములు కల్పించితే యిట్టి అపవాదములు ఎంతవఱకు తీసికొని పోవును"

గాంధీమహాత్ముడు:—"మానవునికి సహాయము చేయజాలక, అతని స్వాతంత్ర్యమునకు భంగము కలిగించునంతవఱకు"

1925 సంవత్సరములో యంగు ఇండియా పత్రికలో మహాత్ముడు యీ క్రింది వ్యాసమును వ్రాసియున్నాడు.

"యంత్రములకు స్థానమున్నది. అవి నిలిచిపోయినవి. అవసరమైన మానవపరిశ్రమకు బదులుగా వానిని వృద్ధి చేయనివ్వరాదు. శాస్త్రీయముగా అభివృద్ధి చేయబడిన నాగలి మంచిదే. కాని ఎందువల్లనైతేనేమి ఒకడే దానివల్ల ఇండియాలోని భూమినంతను సాగుచేసి, పంటనంతను తానే తనరవుచేసుకొనగలిగి యితరులకు పని లేకపోయినచో వారు సోమరిపోతులగుదురు. కృశించెదరు. చాలమంది అయినట్లుగానే బుద్ధిహీనులగుదురు. ... ... ... ... కుటీర పరిశ్రమలయందు ఉపయోగించే యంత్రములకు అభివృద్ధి

పద్ధతులను స్వీకరించెదను. కాని కోట్లమంది వ్యవసాయకు లకు వేలేవని కల్పించగలిగితే తప్ప కదుళ్ళను యంత్రముల ద్వారా త్రిప్పి, చేతివర్త్రమును నాశనము చేయుట గొప్ప నేరమని నేను భావించుచున్నాను."

ఇంకొకచో ఒక పృచ్ఛకుని ప్రశ్నకు సమాధానముగా మహాత్ముడిట్లు చెప్పెను."

"నీవు యంత్రములకు వ్యతిరేకివా అంటే, కాదు అని నాయొక్క గట్టి సమాధానము. కాని విచక్షణ లేకుండా యంత్రాభివృద్ధికి నేను వ్యతిరేకుడను. ప్రస్తుతము అభివృద్ధి వలె కనబడుచున్న యంత్రబలమునకు నేను విభ్రాంతి జెందుట లేదు. వినాశన హేతువులగు యంత్రములకు నేను అవ్యాహతవిరోధిని. కాని సులభమైన యంత్రములు, పని ముట్లు, మానవుని శ్రమను తగ్గించగలిగి, కుటీరములలోని కోట్ల జనమునకు సుఖము నివ్వగలుగజాలియుంటే, వాటిని తప్పక స్వీకరించెదను."

మరొక వ్యాసములో మహాత్ముడు యీవిధముగా నిర్వచించియున్నాడు. "కోరికలను పెంచుకొనుట, వానిని తీర్చుటకై యంత్రములను సృష్టించుట యనునది ప్రపంచ మునొక్క లక్ష్యమును చేర్చుటలో ఒక్క అడుగైనను ముందుకు తీసికొనిపోజాల దని నా దృఢ విశ్వాసము. రాట్నపరిశ్రమ, యంత్రసాధనములను, నాశనము చేయ బూనుట లేదు. యంత్రసాధనములను సరియైన మార్గమున నడిపి అనవసరమైన పెంపుతలను నివారించుచున్నది. కుటీరములలోని బీదపేదలకు సహాయము చేయుటకు

సాధనభూతమగుచున్నది. రాట్నము ఒక సుందరమైన యంత్రసాధనము."

యంత్రములు వాంఛనీయములేగాని వానిని వినియోగ పరచుటలో మాత్రము జాగ్రత్త యుండవలయుననియు, అవి మానవుని స్వేచ్ఛాస్వాతంత్ర్యములకు భంగకరము లుగా నుండరాదనియు, మానవుని శ్రమ తగ్గించగలిగి అందఱికి సుఖమును కలుగజేయ నంతవఱకును, యంత్ర ములు సాహాయ్యకములే అనియు, సాధ్యమైనంతవఱకు కుటీరములలో నివసించే ప్రజలకు సహాయకరములుగా నుండి వారిశ్రమను తగ్గించగలిగి, వారికి పనికల్పించి, వారి జీవనము సుఖవంతముగా జేయజాలినవిగా నుండవలెననియు అందుకు అవసరమైతే, విశేషశక్తితో అనగా ఆవిరి, విద్యు చ్ఛక్తి మొదలగువానితో నడవబడెడు యంత్రములు ఉండవచ్చుననియు, అట్టివి యున్నయెడల వాటిని ప్రభు త్వము వశముచేసుకొనవలెనుగాని, ఏకొందఱువ్యక్తుల చేతులలో నుండరాదనియు, అహింసాసిద్ధాంతముయొక్క తాత్పర్యము. గాంధిమహాత్ముడే యీ అభిప్రాయములను తన అప్రతిమాన ధోరణిలో చెప్పియున్నాడు.

ఆధునికప్రపంచమున పెద్దయంత్రముల నడపుటకు బొగ్గున్ను, చమురున్ను, ముఖ్యసాధనములు. ఆ ప్రకృతి శక్తులే యంత్రచాలనమునకు ముఖ్యాధారములు. ఖనిజ ములు అనంతములుగా లేవు. నేడు గాకపోతే రేపైనను యివి అంతరించిపోవును. పెద్దయంత్రములను ఎంత ఎక్కు వగా ఉపయోగించితే, అంతత్వరగా యీ ఖనిజములు

అంతర్ధానమగును. ఇవి పిత్రార్జితమైన ఆస్తివంటివి. తండ్రి ఆస్తి సంక్రమించిన తరువాత కుమారుడు వేరే సంపాదన లేక పిత్రీయమైన ఆస్తిని వ్యయముచేయ మొదలుపెట్టిన యెడల త్వరితకాలములోనే అతడు నిర్ధనుడగును.

అట్లుగాక తన స్వార్జితముమీదనే ఆధారపడియున్నచో అతడు జీవితపర్యంతమున్ను దరిద్రదశను అనుభవించడు. ఒకవేళ సకృత్తుగా, స్వార్జితము చాలకపోయినయెడల, పిత్రీయమునుంచి, కావలసినమట్టుకు వాడుకున్నయెడల, అప్పుడున్ను అతనికి క్షేమముచేకూరును. అటులనే, భూగర్భమందు దాగియుండిన శక్తులను ఎంతతక్కువగా ఉపయోగిస్తే, అంత దీర్ఘకాలము మానవలోకము సౌఖ్యమును పొందగలదు. వారి నిత్యజీవితమునకు అనంతమైన సూర్యతేజస్సువలన కలిగిన శక్తిని వాడుకొనవచ్చును. అవసరమైనప్పుడు ఖనిజశక్తిని వినియోగించుకొనవచ్చును. ఇదియే ఉత్తమమార్గము. ఇదియే అహింసాపద్ధతి. ఇదియే గాంధివాదము.

దీనినిగూర్చి ఒక శాస్త్రకారుడు వ్రాసినదానికి తర్జుమా చేసి పొందుపఱచుచున్నాను.

"అనేక యుగములనుండియు పేరుకొన్న బొగ్గుయొక్కయు, చమురుయొక్కయు గనులు పెట్టుబడి ధనము వంటిది. వాటిని వాడుకొన్నయెడల మూలధనమును మనము వృద్ధిచేయుటలేదు. 130 ఏండ్ల క్రిందటి కాలము వఱకు, సూర్యతేజస్సువలన ఉద్భవించిన ఆహారమును భుజించి తద్వారా మనుష్యుడు కొద్దికాలములో శక్తిని

ముగా ఉత్పత్తి జరుగుచున్నది. వారు ఎంత విశ్రాంతి నొందుచున్నారో మనకు అనుభవము వలన తెలియుచునే యున్నది" ఎక్కువ విశ్రాంతి సంపాదించుటకై ఏర్పడిన యంత్రములవలన క్రొత్తసమస్యలు ఏర్పడుచున్నవి. ఆ సమస్యలను పరిష్కరించుటకు క్రొత్తసాధనము నారయ వలసివచ్చుచున్నది. ఈ విధముగా విశ్రాంతి లేకపోగా శ్రమ ఎక్కువయగుచున్నది.

రైల్వు రాకపూర్వము ఒకచోటినుంచి మఱియొక చోటికి ప్రయాణమునకు కాలకాలము పట్టినది. నెలరోజు లలో కాలినడకను చేసే ప్రయాణము ఒక రోజులో రైల్వు మూలమున చేరగలుగుచున్నాము. ప్రయాణముతో కలిసి వచ్చిన కాలమును ప్రజలు విశ్రాంతిగా గడుపుచున్నారా? రైల్వు రాకముందు ప్రజలు పొందుచున్న విశ్రాంతికంటె ఇప్పటి ప్రజలయొక్క విశ్రాంతి తక్కువనియే అనుభవము వలన చెప్పవలసివచ్చుచున్నది, ఎవరిని అడిగినను తీరిక లేదని చెప్పువారేగాని, తీరికయున్నదని చెప్పువారు లేరు. ఉన్నత యంత్రనిర్మాణమునకై కల్పింపబడిన పరిస్థితుల వలన, అప్పటికి లేని యితర సమస్యలుత్పన్నమై మానవుని చీకాకుపఱచుచున్నవేగాని. విశ్రాంతి నివ్వజాలకున్నవి. అహింసావాదము యంత్రనిషేధకముగాదు. యంత్రనియామకము. యంత్రములు ఉండవచ్చుగాని, నియమింపబడవలెను. యంత్రముకంటె మానవుడు ప్రధానము. యంత్రమునకు మానవునికి వైరుధ్యము సంప్రాప్తించినపుడల

యంత్రములకు అప్రాధాన్యమున్నూ మానవునికి ప్రాధాన్యమున్ను యివ్వవలెను.

నియమిత యంత్రనిర్మాణమును మహాత్ముడు అంగీకరించుచున్నాడు. ఆహ్వానించుచున్నాడు కూడను. రాట్నమునకు అభివృద్ధికరములైన మార్గముల నన్వేషించుచున్నారు. యంత్రనిర్మాణమును నిషేధించకుండా దానిని సంఘసౌఖ్యమునకు, మానవకళ్యాణమునకు నియమించుటయే, యంత్రములగూర్చి అహింసావాదులయొక్క అభిప్రాయము.

# పదునొకండవ అధ్యాయము

## అహింసయననేమి?

రాట్నము అహింసాచిహ్నమని, ఖాదీసిద్ధాంతము అహింసా సిద్ధాంతమని చెప్పుచున్నారు.

ఇది అహింస ఎట్లగును? రాట్నమునకున్ను, అహింసకున్ను సంబంధమేమిటి? అని పలువురు ప్రశ్నించుచున్నారు. అహింసయను శబ్దమునకు సరియైన అర్థము తెలిసికొన్నచో యీ ప్రశ్నలు ఉదయించవు. "హింస" యనుశబ్దరూపము 'హంతుం ఇచ్ఛా' హింసయని కలుగుచున్నది. ఇది సంస్కృత శబ్దము. హంతుం = కొట్టుటకు లేక బాధించుటకు, ఇచ్ఛా = కోరిక. కాబట్టి హింసయంటే బాధించే కోరిక యని అర్థము.

'నహింసా' ఇతి 'అహింసా' అనగా హింసకానిది అహింస అనబడును. అనగా బాధించేయిచ్ఛ లేకపోవుట యని అర్థము.

రాట్నమువలన నూలుతీయబడుచున్నది. ఆ నూలు వలన వస్త్రము నేయబడుచున్నది. అంతియేకాని, రాట్నము వలన నూలుతీయుటలో హింసాహింసల ప్రసక్తియే లేదే అని వాదించుచున్నారు. రాట్నమువలన నూలుతయారై బట్ట ఉత్పత్తి యగుచున్నది. రాట్నము త్రిప్పుటవలన అనేకమంది తమ జీవనమునకు కావలసిన ఆదాయములో కొంతభాగమును (స్వల్పమైనను) సంపాదించుకొనుచున్నారు. ప్రజలకు వస్త్రోత్పత్తి కావలయునుగదా! రాట్నములతో నిమిత్తము లేకుండా వస్త్రములెట్లు తయారగును? రాట్నములు లేకున్నను, యంత్రములద్వారా మరకదుళ్ళద్వారా నూలు ఉత్పత్తిచేసి వస్త్రమును తయారుచేయగలమని చెప్పవచ్చును. ముగ్గురుమనుష్యులు రాట్నముమీద ఒకగంటలో ఎంతనూలు తీసెదరో ఒక మరకదురు ఒక గంటలో అంతనూలు తీయగలదని అంచనా వేయబడినది. కనుక యంత్రములద్వారా మనము ఒకలక్ష మరకదుళ్లు నిర్మిస్తే, మూడు లక్షలమందికి జీవనమునకు భంగము చేసినవారము అగుదుము. వారికి యంత్రశాలల యొక్క పనియందు నైపుణ్యముండదు. నేర్చుకున్నను కొలదిమందికే పనియుండును. మరకదుళ్ళవలన నిరుద్యోగులైనవారికి వేరే పనికల్పించ గలుగుచో ఆక్షేపణ యుండజాలదు. వారికి పనికల్పించుట ఎట్లు? రాట్నము బదులు మరకదుళ్ళవలెనే ఇతర చేతిపనులకు బదులు యంత్రములు నిర్మింపబడినచో అవృత్తులలోకూడా నిరుద్యోగులు పెరిగిపోవుదురు. ఇంతమంది

నికి అభివృద్ధి, అభ్యుదయము అనునవి కలుగజాలవు. మానవుని పురోభివృద్ధికి, స్వస్వరూపసాక్షాత్కారమునకు పరమానందసంపాదనమునకు, అనురూపమైన సంఘవ్యవస్థ నిర్మించుటకు ఖాదీపరిశ్రమ మూలస్తంభమువంటిది. అందువలన యిది సత్యము అహింసలకు చిహ్నమని చెప్పబడుచున్నది. సోపాన రూపముగా మానవుని అభ్యుదయ నిశ్శ్రేయసములకు దోహద మొసంగును.



# ఆంధ్రాంగ్ల పదానువాదము

| | | |
|---|---|---|
| సామాజిక వ్యవస్థ | — | Social organisation |
| అర్థము | — | Wealth |
| ఆర్థికశాస్త్రము | — | Economics |
| బానిసత్వపద్ధతి | — | Slavery |
| జమీందారీ సేవాపద్ధతి | — | Feudal System |
| పారిశ్రామిక విప్లవము | — | Industrial Revolution |
| పెట్టుబడిదారీ పద్ధతి | — | Capitalism |
| స్వంతఆస్తి | — | Private property |
| సాంఘికవాద పద్ధతి | — | Communism |
| శ్రామికులు | — | Labour |
| వినియోజకుడు | — | Consumer |
| వినియోగము | — | Consumption |
| ఉత్పత్తి | — | Production |
| భారీపరిశ్రమలు | — | Large scale Industries |
| వస్తూత్పత్తి సాధనములు | — | Industries of production |
| పరిశ్రమ | — | Labour |
| యంత్రములు | — | Machine |
| శక్తిప్రమాణము | — | Horse-power |
| వికేంద్రీకరణము | — | Decentralisation |
| కేంద్రీకరణము | — | Centralisation |
| ఉపవృత్తి | — | Supplementary industry |

జాగ్రత్తగా గమనించండి, ఆ పిల్ల లివర్ సరియైన స్థితిలో లేకపోవచ్చును. బహుశ పెద్దదయిన దేమో—

ఈ ఆరంభదశ లక్షణములను గమనించవలెను. అప్పుడు ఉష్ణము తగులుట, మలబద్ధకము లేక విరేచనములు లేక వాంతులు అగుట, ఆకలి లేకపోవుట, కడుపు పెద్దదగుట, చురుకుగానుండక చిరచిరలాడుట.

తక్షణమే శ్రద్ధతీసుకొని కాపాడవచ్చును. పై లక్షణములు కనిపించిన తక్షణమే జమ్మివారి లివర్‌క్యూర్ వాడిన, ఆతురత, శ్రమ, అనవసరపు ఖర్చులు లేకుండా వ్యాధిని ముదిరించుట కవకాశములుండవు.